# అసలైన ఆనందం వీటి సువాసనలో వుంది

## పార్లే

## ఫ్రూట్ డ్రాప్స్

చూడండి ఈవింత...ఆహా ఏమి ఈ అద్భుతం!
మీకు ఎన్నో తియ్యటి బిళ్లలు లభిస్తాయి రంగు
రంగుల తియ్యటి బిళ్లలు...ఎన్నో రుచులు...
రాస్ప్‌బెరీ, బత్తాయి, అనాసకాయ, నిమ్మకాయ,
కమలా పలము. ఎంత తక్కువ ధర!
ఉఱ్ఱూతలూరించే
అయిదు పండ్ల రుచులు ప్రతి
ప్యాకెట్‌లో 10 బిళ్లలు లభిస్తాయి.











everest/980/PP tl

# చందమామ

డిశెంబర్ 1970

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



విడి ప్రతి
75 పైసలు

సంవత్సర చందా
రూ. 9/-









# కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి... రోజంతా దంతక్షయాన్ని నివారించండి!

కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించినదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొంటే ఎక్కువ దంతక్షయమును, ఎక్కువ మందికి అరికట్టినదని దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎప్పుడూ ప్రకటింపబడనటు శాస్త్ర పరీక్షలు నిరూపించేయి. ఎందుకంటె : కాల్గేట్ డెంటల్ క్రీముతో ఒకసారి పళ్లు తోముకొంటేనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి. కాల్గేట్‌కు మాత్రమే యీ ఋజువు ఉన్నది! ఎంతో చక్కని పెప్పర్‌మెంట్ రుచి కూడ ఉంది—కాల్గేట్ డెంటల్ క్రీముతో రోజూ పళ్లు తోముకొనుటకు పిల్లలు యిష్టపడతారు!




COLGATE DENTAL CREAM

శుభ్రమైన, తాజా శ్వాసకు మరియు తెల్లగా మెరిసే పళ్లకు... ఎక్కువమంది జనులు ప్రపంచములో ఏ యితర టూత్‌పేస్ట్‌కంటె కాల్గేట్‌నే కొంటారు!

DC.G.41

పాపకి పళ్ళువస్తున్నాయా?
అజీర్ణమా? ఆరోగ్యం బాగాలేదా?

# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్

మంచి గుణం ఇస్తుంది. జీర్ణశక్తిని పెంపొందించి బాగా ఆకలి వేసేట్లు చేస్తుంది. పాప ఆరోగ్యంగా ఉంటుంది.




అమృతాంజన్ లిమిటెడ్



FDSA1454TE A

## Fabrics & Designs ఫాబ్రిక్స్ & డిజైన్స్






## ప్రతినెల 100 ఉచిత బహుమానములు

అత్యాకర్షణీయమైన బహుమానం కోసం నిరీక్షించండి.

AA/53




## శ్రీరామ్ మిల్స్ లిమిటెడ్

బొంబాయి-13.

# మధురస్వప్నాలు









# శ్వాన్ పెన్నులు
## అంతరిక్ష యుగ విద్యార్థులకు





ఆధునిక తరానికి శ్వాన్ పెన్నులు.
శ్వాన్ మాత్రమే మెత్తగా తేలికగా
జారిపోతూ వ్రాస్తుంది. శ్వాన్
ఆక్స్‌ఫోర్డ్ గాని కేంబ్రిడ్జ్ గాని
తీసుకోండి—ఆనందంగా చంద్రగోళంపై
అడుగుపెట్టండి.



శ్రేష్ఠమైన ఫలితాల కోసం




**శ్వాన్**
డీలక్స్ ఇంకుతో
వ్రాయండి.



hero's SI-120 II

**శ్వాన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్**
అద్వాని చాంబర్స్ పి. మెహితా రోడ్డు,
బొంబాయి-1
బ్రాంచి: 34బి. కన్నాట్ ప్లేస్ క్రొత్త ఢిల్లీ.












New

# Teeth Cleaning Unit
# 'Kashmir'
## TOOTH PASTE
## TOOTH POWDER
## and
## TOOTH BRUSH

by
**THE NATIONAL TRADING CO.,**
Manufacturers of :
**KASHMIR SNOW BEAUTY AIDS**
BOMBAY - 2. MADRAS - 32.

# బ్రిటానియా గ్లూకోస్

## మిల్క్ బిస్కట్టులు

## ఎంతో రుచిగావుండే పుష్టికర ఆహారము








# కొనుక్కో

## జీవిత వినోద సంధాయిని




# క్లిక్ III

రూ 46.50 (పన్నులు అదనం)

**ప్రారంభించటానికి మంచిది. తరువాతఅనుక్షణం కూడా ఉంచు కొనుటకు ఉత్తమం**

క్లిక్ III తో మీబిడ్డను ఛాయా చిత్ర జగతికి పరిచయం చేయండి. దానిని ఉపయోగించటం చాలా సులభం. అడ్జెస్టు చేయవలసిన అవసరం లేదు. మీరు చేయ వలసిన పనల్లా వస్తువును సరిచూడటం. మీట నొక్కటం! ఇది ఎంతో పొదుపైనది కూడాను. రంగులలో కాని తెలుపు నలుపుల లో కాని ప్రతి 120 ఫిలిము రోలుకు సుస్పష్టమైన 12 చిత్రాలను తీయ వచ్చును

అగ్ఫా-గెవార్ట్ వారి సహకారంతో తయారుచేయువారు:
ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్....బరోడా



పోల్ డిస్ట్రిబూటర్లు :
ఆగ్ఫా-గెవార్ట్ ఇండియా లిమిటెడ్
బొంబాయి • న్యూ ఢిల్లీ • కలకత్తా • మద్రాసు.

® ఫొటోగ్రఫిక్ ఉత్పత్తుల నిర్మాతలు అగ్ఫాగెవార్ట్ ఆంట్ వెర్ప్ లివెర్కుసెన్ వారి యొక్క రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

ఆగ్ఫా క్లిక్-భారతదేశంలో విస్తార ప్రజాదరణంకల కెమేరా CMAG-1[illegible]



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

భారతయుద్ధం అతి దారుణమైనది. దానికి కారణాలు రకరకాలుగా చెప్ప వచ్చు. అందరూ చెప్పుకునే కారణం దుర్యోధనుడి మత్సరం. కాని అసలు కారణం ధర్మరాజు చేసిన రాజ సూయం. రాజసూయం యొక్క ప్రధానోద్దేశం సామ్రాజ్యాన్ని స్థాపించటం. దుర్యోధనుణ్ణి రారాజు అన్నారు. జరాసంధుణ్ణి సమ్రాట్టు అన్నారు. కాని వీరిద్దరూ సామ్రాజ్యాలు ఏలినవారు కారు. ఆ కాలంలో ఆ పనికి పూనుకున్న వాడు ధర్మరాజే!

సంపుటి 47 డిసెంబర్ '70 సంచిక 6

CHITRA





# అమాయకురాలు

ఒక ఊరిలో ఒక శిల్పి ఉండేవాడు. అతనికి ఇద్దరు కొడుకులు. వారికి పెళ్ళిళ్ళు అయి భార్యలు కాపరానికి వచ్చారు. శిల్పి భార్యకు చిన్న కోడలైన కనకమ్మ అంటే ఎక్కువ ఇష్టంగా ఉండేది. కనకమ్మ కూడా అత్తగా రంటే ఎంతో ప్రేమాభిమానాలూ, భయ భక్తులూ కలిగి ఉండేది. పెద్ద కోడలు శారద అత్తగారంటే నిర్లక్ష్యంగా ఉండేది.

కొంత కాలానికి శిల్పి భార్య చని పోయింది. శిల్పి ఆమె విగ్రహం నిలువెత్తుది తయారుచేసి ఇంట్లో ఒక పక్క పెట్టాడు. మరి కొంత కాలం గడిచాక శిల్పి కూడా కన్నుమూశాడు.

అత్తమామ లిద్దరూ పోయేసరికి, ఇంటి పెత్తనం దగ్గిర తోడికోడళ్ళిద్దరి మధ్యా చిన్న చిన్న ఘర్షణలు బయలుదేరాయి. ఈ ఘర్ష ణలు లేకుండా చేసుకోవటానికి అన్నదమ్ము లిద్దరూ కూడబలుక్కుని, ఇంటిని రెండు భాగాలుగా విభజించుకుని, నివసించ సాగారు. రెండు భాగాలకూ మధ్యగా ఉన్న గదిలో శిల్పి భార్య విగ్రహం పెట్టారు.

ఆ విగ్రహం గురించి అన్నదమ్ము లేమీ పట్టించుకోలేదు. పెద్దకోడలు శారద కూడా విగ్రహం ఉన్న గదిలోకి అడుగు పెట్టక, తమ వేపు తలుపు బంధించి పెట్టింది. కాని కనకమ్మ అత్తగారు పోయిన దగ్గిరనుంచీ ఆ విగ్రహాన్నే అత్తగారులా చూసుకుంటూ, విగ్రహానికి నమస్కరించి, పూలు పెట్టి, "ఆశీర్వదించండి, అత్తయ్యా!" అని దణ్ణం పెట్టుకునేది; తాను ఏమి చెయ్యా దలుచుకున్నా విగ్రహానికి చెప్పి చేసేది; "ఇవాళ మీ కిష్టమైన కూర చేస్తున్నాను!" అని చెప్పేది. ఆమె చాలా అమాయకురాలు.

ఆమె అమాయికత్వం ఎంత దాకా పోయిం దంటే, ఒకనాడు ఆమె తన అత్తగారికి ఇష్ట మైన వంటకాలు తయారుచేసి, విగ్రహం

సి. నాగార్జునరావు

ముందు విస్తరి వేసి వడ్డించి, "భోంచెయ్యండి. ఇవాళ మీరు భోంచేస్తేనేగాని నాకు ముద్దదిగదు," అని పట్టుబట్టి కూర్చున్నది.

తన తోడికోడలును ఒక కంట కని పెడుతూ వుండిన శారద, తలుపు అవతల నుంచి, "అత్తగారు ఎక్కడన్నా అందరి ఎదటా భోంచేస్తారా ఏం? ఓ ఘడియసేపు ఒంటరిగా వదిలితే భోంచేస్తారు," అన్నది.

"నిజమే కద!" అనుకుని కనకమ్మ తలుపు మూసి తమ భాగంలోకి వెళ్ళి పోయింది. వెంటనే శారద తలుపు తెరిచి, ఆకులో వడ్డించి ఉన్న పదార్థాలన్నీ పాత్ర లోకి తీసుకుని, తమ భాగంలోకి వెళ్ళి పోయి, మళ్ళీ తలుపు మూసేసింది.

ఒక ఘడియ గడిచాక కనకమ్మ అత్త గారి విగ్రహం ఉండే గదిలోకి వెళ్ళి చూస్తే ఖాళీ విస్తరి కనిపించింది. అత్తగారు నిజం గానే భోంచేసిం దనుకుని, ఆమె రోజూ అత్త గారి విగ్రహం ముందు విస్తరి వేసి వడ్డించి, "తినండి, అత్తయ్యా," అని చెప్పి, ఇవత లకు వచ్చేస్తూండేది. ఒక ఘడియ అవతల వెళ్ళి చూస్తే విస్తరి ఖాళీగా ఉండేది.

కనకమ్మ చేస్తున్న ఈ పని ఒకనాడు భర్త కంటపడింది. "నీ కేమైనా పిచ్చి పట్టిందా ఏమిటి? విగ్రహానికి భోజనం పెడు



తున్నావేమిటి?" అని అతను భార్య నడిగాడు.

"అత్తగారు రోజూ భోంచేస్తున్నారు. కావలిస్తే మీరే చూడండి," అన్నది కనకమ్మ.

ఆమె భర్త తలుపు సందులలో నుంచి చూసేసరికి, అవతలి భాగంలో నుంచి తన వదినెగారు వచ్చి, విస్తట్లో వడ్డించిన పదార్థా లన్నీ గిన్నెలోకి తీసుకుంటూ ఉండటం కనిపించింది. శారద ఇలా చెయ్యటం తన అన్నకు ఎంత అవమానమో అతను గ్రహిం చాడు. అతను పరువుగా వదినెగారి దుర్బుద్ధి పోగొట్టే ఉపాయం ఏదా అని ఆలోచించాడు. అతను కనకమ్మతో, "ఇటు చూడు, కనకం!

ఇన్నాళ్ళుగా నువు అమ్మకు అన్నం పెడు తున్నావు గాని ఆమె ఏ రూపంలో వచ్చి భోంచేస్తున్నదీ నువు చూడనే లేదు. రేపు అన్నం పెట్టి, తలుపు సందులో నుంచి చూడు," అన్నాడు.

"అలా చూస్తే, అత్తయ్య సిగ్గు పడతా రేమో ?" అన్నది కనకమ్మ.

"నువు చూస్తున్నట్టు ఆవిడకు ఎలా తెలుస్తుంది?" అన్నాడు భర్త.

కనకమ్మ తృప్తి పడి, మర్నాడు అత్తగారి విగ్రహం ముందు విస్తరి వేసి వడ్డించి, తలుపులో ఉన్న సందు గుండా లోపలికి చూసింది. ఆమెకు శారద కనబడింది.

కనకమ్మ ఆశ్చర్యపోయింది. తన అత్త గారు తాను పెట్టిన భోజనాన్ని తన తోడికోడలి రూపంలో వచ్చి భోజనం చేసి ఇద్దరు కోడళ్ళకూ న్యాయం చేస్తున్నదన్నమాట! ఆవిడ ఇంటి పెద్దకోడలి రూపంలో రావటం కనకమ్మకు చాలా ఉచితంగా తోచింది.

ఆమె శారద వద్దకు వెళ్ళి, "అక్కా, నువ్వెంత అదృష్టవంతురాలివి! అత్తయ్య నీ రూపంలో వచ్చి భోంచేస్తున్నారు. ఇక మీద నేను నిన్ను అత్తగారిలా చూసు కుంటాను!" అన్నది.

శారద ముఖం కందిపోయింది. కన కమ్మ నిజం తెలుసుకుని, తనతో వ్యంగ్యంగా మాట్లాడుతున్నదని అనుకుని, ఆమె విగ్రహం గదిలోకి రావటం మానేసింది.

తాను రోజూ వడ్డించే భోజనం అత్తగారు తినటం మానేసిన సంగతి గమనించి కన కమ్మ, "నేను తొంగి చూసిన సంగతి అత్త గారికి తెలిసినట్టున్నది. ఆమె భోజనం చెయ్యటం లేదు!" అని భర్తతో విచారంగా చెప్పింది. భర్త ఆమెకు అసలు విషయం చెప్పి, ఊరడించాడు. శారద తనకు ముఖం చూపటానికి సిగ్గు పడుతూండటం గమ నించిన కనకమ్మ, తన భర్త చెప్పినది నిజమేనని గ్రహించింది.





# యుక్తిపరుడు

పూర్వం విదర్భదేశాన్ని శక్తిమంతుడు అనే రాజు పరిపాలిస్తూండేవాడు. కళింగ రాజయిన శూరసేనుడికి విదర్భరాజ్యాన్ని కబళించాలని బుద్ధి పుట్టింది. విదర్భ వార్తలు ఎప్పటికప్పుడు అందజేయటానికి అనేక మంది చారులను నియోగించాడు.

ఈ సంగతి శక్తిమంతుడికి తెలిసింది. శూరసేనుడి చారులు కొందరు పట్టుబడ్డారు. మిగతా చారులకు హెచ్చరికగా ఉండగలందులకు శక్తిమంతుడు పట్టుబడిన చారులను తీవ్రంగా శిక్షించాడు.

అయితే శక్తిమంతుడి దివాణంలోనే శూరసేనుడి చారులు తయారయారు. అంతఃపురంలో జరిగేవి కూడా శూరసేనుడికి తెలిసిపోతున్నాయి. ఈ సంగతి శక్తిమంతుడు గ్రహించాడు. ఆయన అంతరంగికులుగా మసలేవారిలోనే ఆయనకు ద్రోహం తలపెట్టి, శూరసేనుడి చారులుగా పని చేస్తున్న వాళ్ళున్నారని శక్తిమంతుడు రూఢి చేసుకున్నాడు.

ఈ ద్రోహులను పట్టివేయాలి. కాని తన పరివారంలో ద్రోహులెవరో, నమ్మదగిన వాళ్ళెవరో తెలుసుకోవటం శక్తిమంతుడికి చాలా కష్టమయింది. అందరూ నమ్మదగిన వారిలాగానే, రాజభక్తులలాగానే పైకి కనబడుతున్నారు.

వారి అసలు రూపాలు తెలుసుకునేటందుకు బుద్ధిమతి అనేవాణ్ణి నియోగించాడు. ఈ బుద్ధిమతి అనేవాడు మంచి తెలివితేటలు గలవాడు. రాజుకున్న రహస్య సలహాదారులలో ముఖ్యుడు. అదీగాక, అతను ఇంతకుమునుపు కొందరు శూరసేనుడి చారులను బయట పెట్టటానికి సహాయ పడినవాడు. అంతఃపురంలోనే శత్రువుల చారులున్నట్టు మొదట ఆధారాలు సంపాదించినవాడూ అతనే.

మల్లాది . వెంకటకృష్ణమూర్తి

రాజుగారు నియోగించిన మీదట బుద్ధిమతి దివాణంలోని చారులను పట్టుకునేటందుకు దీర్ఘంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు.

మర్నాడు రాత్రి బుద్ధిమతి రాజుగారి కొలువులో ఉన్న ముఖ్యులను ఇరవై అయిదు మందిని తన ఇంటికి విందుకు ఆహ్వానించాడు. వీరందరూ వచ్చారు. విందు జరిగింది. తరవాత బుద్ధిమతి ఒక్కొక్కరితోనూ రహస్యంగా, "ఇది నా వీడ్కోలు విందు. నేను శత్రువుల గూఢచారి నన్న విషయం రాజుగారు ఎలాగో పసి కట్టాడు. ఇవాళ విందుకు వచ్చిన వారిలో గూఢచారులైనవాళ్ళ పేర్లు కూడా రాజుగారికి తెలిసిపోయాయి. ఈ గూఢచార్లందరినీ రేపు ఉదయం ఉరి తీయటానికి రాజుగారు ఏర్పాట్లు చేసి ఉన్నాడు. నేను దీపం ఉండగానే ఇల్లు చక్క పెట్టుకోకపోతే, రాజుగారికి నా పైనగల అనుమానం రుజువయి, రేపు ఉరి పడనున్న వాళ్ళలాగే నేనూ ఉరిశిక్ష పడవలిసి వస్తుంది. అందుచేత నేను తెల్లవారే లోపల ఈ దేశపు పొలిమేర దాటిపోతున్నాను. ఈ సంగతి నీ కొక్కడికే చెబుతున్నాను. దీన్ని మరెవరికీ తెలియనీయవద్దు. రహస్యంగా వుంచు, మరి సెలవు!" అని చెప్పాడు.



ఇలా ప్రతి ఒక్కడికీ చెప్పి బుద్ధిమతి పంపెయ్యగానే నిజమైన రాజభక్తిగల వారందరూ తిన్నగా అంతఃపురానికి వెళ్ళి, రాజుగారికి బుద్ధిమతి రహస్యం చెప్పేశారు.

"ఆ దుర్మార్గుడి సంగతి నేను కనిపెడుతూనే ఉన్నాను. అతను పొలిమేర దాటిపోకుంటా వేగులవాళ్ళను అదివరకే ఉంచాను. మీరు నిశ్చింతగా ఇళ్ళకు పోయి సుఖంగా నిద్రపొండి," అని ధైర్యం చెప్పి వారిని పంపేశాడు రాజు.

తెల్లవారు జామున బుద్ధిమతి తన ఇంటి నుంచి బయలుదేరి, గుర్రం మీద అతి వేగంగా పొలిమేర కేసి వెళ్ళాడు. అతను పొలిమేరను సమీపించేసరికి చెట్ల చాటు నుండి ఇద్దరు అశ్వికులు అతన్ని సమీపించారు.

వాళ్ళు రాజుగారి కొలువులో ఉన్నవారే. వారిని చూసి బుద్ధిమతి, "మీరు కూడా వచ్చారా? మంచిపని చేశారు!" అన్నాడు.

"అవును, మేము కూడా నీతో వచ్చేస్తాము. నిన్న రాత్రి మీ ఇంటి నుంచి వచ్చాక మాకు నిద్ర పట్టలేదు. మామీద రాజుగారికి రుజువులు కూడా దొరికినాక మేము పారిపోక, ఉరి పడటం అవివేకంగద. నువు తెలివిగలవాడివి గనక ముందే జాగ్రత్త పడ్డావు." అన్నారు వాళ్ళు.

"రండి, పోదాం. సమీపంలో ఒక పాడు పడిన గుడి ఉంది. అక్కడ కాస్త విశ్రాంతి తీసుకుందాం," అన్నాడు బుద్ధిమతి.

ముగ్గురూ గుడిని సమీపించి, గుర్రాలను దిగి గుడి లోపలికి వెళ్ళారు. మరుక్షణమే శక్తిమంతుడి భటులు వచ్చి వారిని చుట్టుముట్టారు. బుద్ధిమతితోపాటు రాజద్రోహులిద్దరూ రాజుగారి వద్దకు తీసుకుపోబడ్డారు. రాజు అడిగిన మీదట రాజద్రోహులు తమ నేరం ఒప్పుకున్నారు. రాజు బుద్ధిమతి చాతుర్యాన్ని బహిరంగ సభలో మెచ్చుకుని, అతన్ని ఘనంగా సత్కరించాడు.






సన్తప్తాయసి సంస్థితస్య పయసో నామాపి న శ్రూయతే,
ముక్తాకారతయా తదేవ నలినీపత్రస్థితం దృశ్యతే,
అన్తస్సాగరశుక్తిమధ్యపతితం తన్మౌక్తికం జాయతే ;
ప్రాయేణాధమ, మధ్య, మోత్తమజుషా మేవంవిధా వృత్తయః. 1.

[ కాలిన ఇనుము మీద పడ్డ నీరు నామరూపాలు లేకుండా పోతుంది ; అదే నీరు తామరాకు మీద ముత్యంలాగా కనబడుతుంది ; ఆ నీరే సముద్రంలోని ముత్యపుచిప్పలో పడి నిజంగా ముత్యమవుతుంది. అథమ, మధ్యమ, ఉత్తమ స్థానాలను పొందినవారి స్థితి ఇలాగే ఉంటుంది. ]

యః ప్రీణయేత్ సుచరితైః పితరం స పుత్రః,
య ద్భర్తు రేవ హిత మిచ్ఛతి తత్ కళత్రం,
త న్మిత్ర మాపది సుఖేచ సమక్రియం యత్ ;
ఏతత్ త్రయం జగతి పుణ్యకృతో లభంతే. 2.

[సత్ప్రవర్తనతో తండ్రిని సంతోషపెట్టినవాడే కొడుకు ; భర్త మంచి కోరినదే భార్య ; ఆపదలోనూ, సంపదలోనూ సమంగా ఉండేవాడే మిత్రుడు. ఈ మూడూ పుణ్యాత్ములకే లభిస్తాయి. ]

దుర్భిక్షే చాన్నదాతారం, సుభిక్షే చ హిరణ్యదం,
చతురోహంనమస్యామి, రణే ధీరం, ఋణే శుచిం. 3.

[కరువులో అన్నదానం చేసేవాడికీ, సుభిక్షంలో సువర్ణదానం చేసేవాడికీ, యుద్ధంలో ధైర్యంగలవాడికీ, ఋణంలేనివాడికీ నా నమస్కారం. ]

యోగ్యతలు



# రాతిరథం

**3**

[రాకుమారి పద్మావతి, ఖడ్గ జీవదత్తులకు తనకు దొరికిన ఒక బొమ్మ రాతిరథాన్ని చూపి, వింధ్యపర్వత ప్రాంతాల్లో వున్న అలాంటి పెద్ద రాతిరథాన్ని కదిలించమన్నది. ఆ రాత్రి వాళ్ళను ముగ్గురు మనుషులు చంపజూచారు. ఖడ్గవర్మ వాళ్ళల్లో ఒకడి కాలు తెగ్గొట్టాడు. ఆ సమయంలో రాజభటులు అక్కడికి పరిగెత్తుకు వచ్చారు. తరవాత—]

ప్రహరీ గోడ అవతల రేగిన కలకలం వింటూనే జీవదత్తుడు అతిథిగృహం నుంచి, ఖడ్గవర్మ వున్న చోటుకు పరిగెత్తాడు. ఖడ్గవర్మ గోడ అవతల జరుగుతున్న గొడవ ఆలకిస్తున్నాడు. రాజభటులు కాలు తెగిన ముసుగు వ్యక్తిని ప్రశ్నిస్తున్నారు. వాళ్ళకు జవాబుగా వాడు పెద్దగా మూలుగుతున్నాడు.

ఖడ్గవర్మ ఒకటి రెండు మాటల్లో జరిగినదంతా జీవదత్తుడికి చెప్పాడు. జీవదత్తుడు ఆలోచించాడు; ఒక ముసుగువాడి శవం తామున్న అతిథిగృహంలో వున్నది. ఒకడు పారిపోయాడు, మరొకడు కాలు తెగి రాజవీధిలో పడివున్నాడు! ఆ ముసుగువాళ్ళను పంపిన శత్రువు లెవరై వుంటారు?

తక్షణం చేయవలసిన పనిని గురించి ఒక నిర్ణయానికి వచ్చిన జీవదత్తుడు, ప్రహరీగోడ ఎక్కి అవతల వున్న రాజభటులతో, "మీరు కేకలు వేసి గొడవ చేస్తే పది



మందీ పోగవుతారు. ఈ ముసుగువాడు రాజగృహంలో ప్రవేశించ చూసి, తగిన శాస్తికి గురయ్యాడు. అంతా రాజుగారు చూసుకుంటారు. వాణ్ణి గోడమీదగా లోపలికి పడవెయ్యండి!" అన్నాడు.

రాజప్రాసాదం లోపలి నుంచి మాట్లాడుతున్నాడు గనక జీవదత్తుడు ఎవరో ముఖ్య రాజోద్యోగి అయివుంటాడని భావించి, రాజభటులు కిక్కురుమనకుండా ముసుగువాణ్ణి పైకెత్తి గోడ మీద వున్న జీవదత్తుడికి అందించారు. జీవదత్తుడు వాణ్ణి దిగువ నున్న ఖడ్గవర్మ కేసి జార్చి, గోడ మీంచి కిందికి దూకాడు.



ఇప్పుడు కాలుపోగొట్టుకున్న ఆ ముసుగువాడి ముఖాన ముసుగు ఏంలేదు. ఆ నల్లటి వస్త్రం భుజం మీది నుంచి వేలాడుతున్నది. జీవదత్తుడు దాన్ని చించి యింకా రక్తం కారుతున్న వాడి కాలి గాయానికి గట్టిగా బిగించాడు. తరవాత అతడూ, ఖడ్గవర్మా వాణ్ణి తమ అతిథి గృహంలోకి మోసుకుపోయి, నేల మీద పడుకోబెట్టారు.

"నువ్వెవరివి? మమ్మల్ని చంపేందుకు నిన్నూ, నీ అనుచరుల్నీ పంపిన వాళ్లెవరు?" అని ప్రశ్నించాడు, జీవదత్తుడు వాణ్ణి.

వాడు దాహం అన్న సూచనగా చేయి ఆడించాడు. ఖడ్గవర్మ ఒక పాత్రలో నీళ్ళు తెచ్చి వాడి నోటికి అందించాడు. దాహం తీరిన తరవాత వాడు బాధతో మూలుగుతున్నప్పటికీ, కాస్త మైకం వదిలి యీ లోకంలోకి వచ్చినవాడిలా, చుట్టూ ఓ మారు కలయజూశాడు. అతడి దృష్టికి జీవదత్తుడి దండం దెబ్బకు ప్రాణాలు కోల్పోయినవాడి శవం—గదికి ఓ మూలగా కనిపించింది. దాన్ని చూస్తూనే వాడు పెద్దగా మూలిగాడు.

జీవదత్తుడు అతడితో, "ఒరే, నువ్వెవరు? నిన్ను పంపిన దుర్మార్గు లెవరు? నిజం





చెప్పావే రాజవైద్యుణ్ణి పిలిపించి నువ్వు రక్తస్రావంతో చావకుండా బతికే మార్గం చూస్తాను,'' అన్నాడు.

ఆ మాటకు కాలు తెగినవాడు గట్టిగా కళ్ళు మూసుకుని ఒకటి రెండు క్షణాలు మౌనంగా వూరుకుని, తరవాత కళ్ళు తెరిచి, జీవదత్తుణ్ణీ, ఖడ్గవర్మనూ ఓసారి పరీక్షగా చూసి, "మీరు క్షత్రియులు, నేనూ క్షత్రియుణ్ణే. ముందు నాకు చికిత్స చేయించటం ధర్మం!'' అన్నాడు.

ఆ మాటలు ఖడ్గవర్మకు చాలా కోపాన్ని తెప్పించినై. అయినా అతడు దాన్ని తొక్కి పెడుతూ, "నీచుడా! నువ్వు క్షత్రియుడవేమోగాని, క్షాత్రం మాత్రం నీలో లేదు. దొంగచాటుగా వచ్చి, నిద్రపోతున్న మమ్మల్ని చంప జూచినవాడివి, నీ వెలాంటి క్షత్రియుడివి!'' అన్నాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మను కొంచెం శాంతించమని చెప్పి, బయటికిపోయి రాజభవనం కాపలావాళ్ళొకణ్ణి పిలిచి, వాడితో త్వరగా వైద్యు డెవరినైనా పిలుచుకు రమ్మని చెప్పాడు.

కాపలావాడు వైద్యుణ్ణి తెచ్చే లోపల జీవదత్తుడు, కాలు తెగినవాణ్ణి మరొకసారి నిజం చెప్పమని ప్రశ్నించాడు. దానికి వాడు కొంచెంసేపు తటపటాయించి, చివరకు, "అయ్యా, నా ప్రాణాలు మీ చేతుల్లో వున్నవి!....చెప్పక తప్పదు. నేను మహేంద్రనగరం రాజుగారి రెండవ కుమారుణ్ణి. ఈ చచ్చినవాడు మంత్రిగారి మూడో కుమారుడు. ఆ పారిపోయినవాడు, సేనాపతి పెద్ద కొడుకు,'' అన్నాడు.

"నిజమా? అలా అయితే, ఆ తరవాతి కథ మహ బావుంటుంది! మరి, మీ ముగ్గురు మహావీరులూ, ఈ పద్మపురంలో ముసుగులు తగిలించుకుని రాత్రివేళ కొంపలకు కన్నాలేస్తున్నారెందుకు? తమ పేరు?'' అన్నాడు జీవదత్తుడు.






"నా పేరు ప్రతాపచంద్రుడు. నేను ఈ పరాయి నగరంలో రాత్రివేళ యింత సాహసానికి ఒడిగట్టటానికి కారణం, ప్రేమ!" అన్నాడు కాలు తెగినవాడు.

"పేరులో తప్ప మీలో ప్రతాపం లేదు, ప్రతాపచంద్రా! మీ ప్రవర్తనా, చేయబూనిన పనీ: పిరికివాళ్ళూ, దుష్టులూ చేసేది. సరే, ప్రేమ అన్నారే, ఏమిటా ప్రేమ?" అని అడిగాడు జీవదత్తుడు.

ప్రతాపచంద్రుడు బాధతో మధ్య మధ్య మూలుగుతూ, ఖడ్గ జీవదత్తులకు, తాను రాకుమారి పద్మావతిని ప్రేమించాననీ, ఆమె మహావీరుణ్ణి తప్ప వివాహ మాడనని ప్రతిన బట్టటంతో, తన మిత్రులతో కలిసి, ఈ నగరం వచ్చి ఆమెను అపహరించుకు పోజూశాననీ చెప్పాడు. కాని, తన ప్రయత్నానికి ఆటంకంగా ఖడ్గ, జీవదత్తులు కనిపించారనీ--అందుకే ముందు వాళ్ళను తుదముట్టించేందుకు ప్రయత్నించాననీ అన్నాడు.

ప్రతాపచంద్రుడు రాకుమారిని అపహరించుకు పోవటానికి, తామిద్దరూ ఎలా ఆటంకంగా పరిణమించారో ఖడ్గ జీవదత్తులకు అర్థం కాలేదు. చావు బతుకుల మధ్య వూగిసలాడుతున్న వాడి మాటలు హేతుబద్ధంగా వుండే అవకాశం లేదన్నాడు జీవదత్తుడు, ఖడ్గవర్మతో. ఇంతలో కాపలా వాడు ఒక యువవైద్యుణ్ణి అక్కడికి తీసుకువచ్చాడు.

ఈ వచ్చిన యువవైద్యుడు రాజవైద్యుడి దగ్గిర వైద్యవిద్య నేర్చుకుంటున్నవాడు. అతడికి యీ నాటివరకూ సొంతాన ఎవరికీ చికిత్స చేసే అవకాశం చిక్కలేదు. అందువల్ల బాధతో మూలుగుతున్న ప్రతాపచంద్రుణ్ణి చూస్తూనే, "అహా, కాలు తెగిపోయిందా? కుడికాలై పోయిందిగాని, ఎడమ కాలైతే తిరిగి కుట్టి, కట్లు కట్టేసి వుందును." అన్నాడు వెంట తెచ్చుకున్న సంచీలోంచి మందుమాకులు తీస్తూ.



"కాలు తెగిపోయి చాలా సేపయింది. మనిషి చావకుండా కాపాడండి, చాలు. రాజుగారు చాలా సంతోషిస్తారు." అన్నాడు జీవదత్తుడు.

"నా చేతుల్లో యింతవరకూ ఎవరూ చావలేదు. నా సొంతాన యీ నాటివరకూ ఎవరికీ వైద్యం చేసింది కూడా లేదను కోండి!" అంటూ యువవైద్యుడు, ప్రతాప చంద్రుడి కాలికి కట్టి వున్న వస్త్రం ముక్కను విప్పి, గాయానికి మందులు పూసి, తిరిగి కట్టుకట్టేశాడు.

యువవైద్యుడు యీ విధంగా తన పని పూర్తి చేసుకుని బయిటికిపోయిన పావు గంట



కల్లా రాజు పద్మసేనుడూ, మంత్రి సోమ దేవుడూ అతిథి గృహం దగ్గిరకు వచ్చి, బయట నిలబడి, కాపలావాడి చేత ఖడ్గ జీవ దత్తులకు కబురు చేశారు. వాళ్ళిద్దరూ బయిటికి వచ్చి, రాజునూ, మంత్రినీ చూసి ఎక్కడలేని ఆశ్చర్యం పొందారు.

వాళ్ళ ఆశ్చర్యాన్ని గమనించిన మంత్రి చిన్న గొంతుతో, "మాకు ఈ జరిగి పోయిన దుర్ఘటన సంగతి ఎలా తెలిసిందనా మీ ఆశ్చర్యం? గోడలకు చెవు లుంటాయి; కాపలావాళ్ళు కూడా వుంటారు! సరే, యింతకూ ఆ ప్రతాపచంద్రుడు బతుకు తాడా? అతణ్ణి ఏం చేయదలిచారు?" అని అడిగాడు.

రాజు, ఖడ్గ జీవదత్తుల ముఖాల కేసి తీవ్రంగా చూస్తూ వూరుకున్నాడు. ఆయనకు యీ ప్రతాపచంద్రుడి కారణంగా మహేంద్ర నగర రాజుతో యుద్ధంలాటిది రావచ్చున్న అనుమానం పట్టుకున్నది. ఈ పరిణామానికి కారకులు ఖడ్గ జీవదత్తులే అని ఆయనకు అనిపించింది.

జీవదత్తుడు రాజు మౌనానికి కారణం గ్రహించి, జరిగినదంతా అయనకు నివే దించి, "మహారాజా! మేము ఆత్మరక్షణకు మాత్రమే యిలా చేయవలసి వచ్చింది.



పైగా అప్పట్లో మాకు యీ ముసుగు వ్యక్తుల నాయకుడు మహేంద్ర నగరరాజ కుమారుడని తెలియదు," అన్నాడు.

"సరే, జరిగిందేదో జరిగింది. ఇప్పుడేం చేస్తే బావుంటుంది?" అన్నాడు రాజు. ఆ ప్రశ్న మంత్రినీ, ఖడ్గజీవదత్తుల్నీ కూడా ఉద్దేశించి మరీ ఆయన అడిగాడు.

మంత్రి సోమదేవు డేమంటాడో చూద్దామని జీవదత్తుడు కొద్దిసేపు జవాబివ్వకుండా వూరుకున్నాడు. కాని, సోమదేవుడు కొంచెం సేపు ఆలోచిస్తూ వూరుకుని తరవాత జీవ దత్తుడితో, "మహారాజుగారికీ, నాకూ యీ జరిగిన విపత్తు తెలియదే అనుకుందాం. అప్పుడు మీ ఇద్దరూ ఏం చేసి వుండేవాళ్లు?" అని ప్రశ్నించాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మ కేసి చూశాడు. ఖడ్గవర్మ నువ్వే చెప్పమన్న సూచనగా తలాడించి వూరుకున్నాడు. అప్పుడు జీవదత్తుడు, "మహారాజా, మహామంత్రీ మా ప్రవర్తనలో ఎలాంటి తొందరపాటూ లేదని ఒప్పుకుంటారనుకుంటాను. ఈ ప్రతాపచంద్రుణ్ణి ఏమి చేయాలనేది మాకై మేము నిర్ణయించ గలిగితే—యిలా చేస్తాం. ఇతణ్ణి తెల్లవారే లోపలే నగరం దాటించి అరణ్యంలో ఏ చెట్టు కిందో పడుకోబెట్టి, మా దారిన




మేము రాతిరథం కోసం వింధ్యారణ్యాలకు పోతాం." అన్నాడు.

"బహుశా అరణ్యంలో అతణ్ణి ఏ క్రూర మృగమో తినేస్తుంది. కాని పారిపోయిన సేనాని కొడుకు మూడోవాడి మాటేమిటి? వాడు మహేంద్రనగరం చేరి జరిగిన దంతా తమ రాజుకు చెప్పేస్తాడు గదా!" అన్నాడు, పద్మసేన మహారాజు.

"అందువల్ల మహారాజుకు ఎలాంటి చిక్కూ రాదు. వాడు మా ఇద్దరిని గురించే చెపుతాడు. ఆ రాజు మా మీద పగసాధిం చేందుకు ప్రయత్నిస్తాడు. మంత్రి కొడుకు శవాన్నీ, ప్రతాపచంద్రుణ్ణీ నగరం దాటించి

తీసుకుపోయేందుకు మాకు ఒక బండీ, అనుమతి పత్రం యిప్పించండి, చాలు. తక్కిన పనులన్నీ అరణ్యంలో మేం పూర్తి చేస్తాం," అన్నాడు జీవదత్తుడు.

పద్మసేనరాజూ, మంత్రీ కొంచెం దూరంగా పోయి కొద్దిసేపు ఏదో మాట్లాడుకుని తిరిగి ఖడ్గజీవదత్తుల దగ్గిరకు వచ్చారు. వాళ్ళిద్దరికీ జీవదత్తుడు చెప్పిన ఉపాయం దివ్యంగా కనిపించింది.

"సరే, మీరు కోరినట్టే వేగవంతమైన రెండెద్దులను పూన్చిన బండీ యిప్పిస్తాను. శవాన్నీ, ఆ ప్రతాపుణ్ణీ దాంట్లో వేసుకుని సూర్యోదయం లోపల నగరం దాటి అరణ్యం చేరండి," అన్నాడు రాజు.

రాజుగారి ఆజ్ఞ కాగానే కాపలావాడు రెండెడ్లను కట్టిన బండీ ఒక దాన్ని, వెనకా ముందు తెరలు కట్టి తీసుకువచ్చాడు. నగర ద్వారాన్ని కాపలా కాసేవాళ్ళకు ఎడ్లబండిని బయిటికి వదలవలసిందిగా సోమదేవుడు పత్రం రాసి, దానిమీద తన సొంత ముద్ర వేసి జీవదత్తుడికి యిచ్చాడు.

ఖడ్గ, జీవదత్తులు మహేంద్రనగర మంత్రి కొడుకు శవాన్నీ, సొమ్మసిల్లి పడివున్న ప్రతాపచంద్రుణ్ణీ బండిలో వేసుకుని, దాని గూడుకు వెనకా ముందూ తెరలు అడ్డం కట్టి, బండి తోలుకుంటూ పోయి నగర ద్వార రక్షకులకు మంత్రిగారి ఆజ్ఞాపత్రం చూపారు. ద్వారరక్షకులు మారుమాటాడకుండా బండిని బయిటికి పోనిచ్చారు.

నగరం వదులుతూనే ఖడ్గ జీవదత్తులు ఎడ్లను గట్టిగా అదిలించి, అరణ్యంలో తమకు తెలిసిన పశువుల కాపరి వృద్ధుడున్న గుడిశె కేసి వేగంగా బయలుదేరారు. అదే సమయంలో ప్రాణాలతో బతికి బయటపడిన ప్రతాపచంద్రుడి మిత్రుడు, జరిగిన సంగతి తమ రాజుకు చెప్పేందుకు గుర్రం మీద శరవేగంతో మహేంద్రనగరం దిక్కు కేసి బయలుదేరాడు. —(ఇంకా వుంది)






# నవ్విన దొంగ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానానికి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఏ స్నేహితుడి కొరకైనా ఇలా శ్రమపడుతున్న పక్షంలో స్నేహితులను గుడ్డిగా నమ్మకు. పరిస్థితుల ప్రభావం వల్ల ఆప్తమిత్రులే ద్రోహులవుతారు. స్నేహభావంతో చెడిపోయిన తారానాథుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒక కుగ్రామంలో తారానాథుడూ, సోమనాథుడూ అని ఇద్దరు ఆప్తమిత్రులుండేవారు. వాళ్ళు ధనార్జన చేయదలచి, తమ గ్రామం విడిచి పెట్టి, దూరదేశాలకు వెళ్ళి వర్తకం చేసి మంచి లాభాలు గడించారు. ఆ లాభాలను ఇద్దరూ సమంగా పంచుకుని, తమ తమ ఇళ్ళలో స్థిరపడ్డారు.

## బేతాళ కథలు






తారానాథుడు తన డబ్బును పొదుపుగా వాడుకుంటూ, ఏ లోటూలేకుండా సుఖ జీవనం చేస్తూ వచ్చాడు. కాని సోమనాథుడు హెచ్చుకాలం రాజధానీనగరంలోనే గడు పుతూ, తాగుడూ, జూదమూ అలవాటు చేసుకుని, త్వరలోనే తనకున్నదంతా తగ లేసి, కట్టుగుడ్డలతో మిగిలాడు.

ఒక రోజు సాయంత్రం తన ఇంటికి వచ్చిన సోమనాథుణ్ణి చూసేసరికి తారా నాథుడికి కళ్ళ నీళ్ళ పర్యంతమయింది. సోమనాథుడు వాడిన ముఖంతో, జుట్టురేగి, కట్టినబట్టలు మట్టికొట్టుకుని, దరిద్ర దేవతలాగా ఉన్నాడు.

"ఏమిటి సోమనాథా ? ఇలాటి దుస్థితి నీ కెలా వచ్చింది ?" అంటూ తారానాథుడు అతనికి కొత్తబట్ట లిచ్చి, చక్కగా భోజనం పెట్టి, ఆ రాత్రి అతను సుఖంగా నిద్ర పోవటానికి సౌకర్యం కలిగించాడు.

అయితే సోమనాథుడికి ఆ రాత్రి నిద్ర పట్టలేదు. తన మిత్రుడు చూపిన ఆదరానికి అతను సంతోషించక పోగా ఈర్ష్య పడ్డాడు. తనతో సమంగా డబ్బు పంచుకున్న తారా నాథుడు మహారాజుగా జీవించట మేమిటి ? తాను తిండికీ, బట్టకూ కూడా లేనివాడు కావటమేమిటి ?

పచ్చి తాగుబోతుగా తయారైన సోమ నాథుడికి, ఈ సంగతి తలుచుకున్న కొద్దీ తారానాథుడి పైన పట్టరాని ద్వేషం కలి గింది. ఒక రాత్రివేళ అతను తన మంచం మీది నుంచి లేచి, మూలనున్న కర్ర తీసుకుని, నిద్రపోతున్న తారానాథుణ్ణి స్పృహతప్పి పోయేటట్టు కసికొద్దీ కొట్టి, అప్పటి కప్పుడే రాజధానికి బయలుదేరి పోయాడు.

మర్నాడు అతను రాజుగారి న్యాయసభకు వెళ్ళి, "మహారాజా, మా గ్రామంలో తారా నాథుడని నా బాల్యమిత్రు డొకడున్నాడు. నేను దేశాంతరాలకు వెళ్ళి, వర్తకం చేసి



ధనం సంపాదించుకుని తిరిగి వచ్చేసరికి అతను నా ఇల్లు ఆక్రమించుకున్నాడు; బాల్యస్నేహితుడు గదా అని మంచిగా నా యిల్లు ఖాళీ చేసి ఇయ్యమంటే నన్ను పట్టుకుని చావగొట్టాడు. తమరు నా దుస్థితి గమనించి నాకు న్యాయం జరిగేటట్టు అనుగ్రహించాలి," అన్నాడు.

రాజు తన భటులను గ్రామానికి పంపి తారానాథుణ్ణి రప్పించాడు. సోమనాథుడు కిందటి రాత్రి కొట్టిన దెబ్బలతో సగం చచ్చి ఉన్న తారానాథుడు భటుల సహాయంతో రాజుగారి కెదురుగా నిలబడ్డాడు.

"నువు ఉంటున్న ఇల్లు సోమనాథుడిదిట. ఆ మాట నిజమేనా?" అని రాజు తారానాథుణ్ణి అడిగాడు.

తారానాథుడు సోమనాథుడి కేసి చూసి, సంగతి గ్రహించి, "నిజమే, మహారాజా! ఆ ఇల్లు సోమనాథుడిదే!" అన్నాడు.

"ఆ ఇల్లు ఖాళీ చెయ్యమంటే, నువు సోమనాథుణ్ణి కొట్టినమాట నిజమేనా?" అని రాజు మళ్ళీ అడిగాడు.

తన మీద ఇలాటి ఫిర్యాదు చేసిన సోమనాథుడి మనస్థితికి జాలిపడి తారానాథుడు, "నిజమే, మహారాజా!" అని తలవంచుకున్నాడు.





సోమనాథుడు స్నేహభావమనేది ఎలా ఉంటుందో పూర్తిగా మరిచిపోయి ఉండటం చేత, తారానాథుడు తను కొట్టిన దెబ్బలతో మతిచెడి అలా జవాబులు చెబుతున్నాడనుకున్నాడు.

రాజు తారానాథుణ్ణి దోషిగా నిర్ణయించి అతనికి కారాగార శిక్ష విధించాడు. భటులు అతన్ని తీసుకు పోయారు.

ఈ తీర్పు వినగానే, విచారణ నిమిత్తం తీసుకురాబడిన దొంగ ఒకడు సభ అంతా మారు మోగేటట్టు గట్టిగా నవ్వాడు.

సభ ముగియగానే రాజుగారు దొంగను తన వద్దకు పిలిపించి, "ఎందు కలా నవ్వావు?" అని అడిగాడు. దొంగ ఆయనకు తాను నవ్విన కారణం చెప్పాడు.

రాజు వెంటనే సోమనాథుడి వద్దకు ఒక మనిషిని పంపించి, "ఇవాళ తమరు రాజుగారి ఇంట అతిథిగా ఉంటున్నారు!" అని చెప్పి తన వెంట రాజభవనానికి తీసుకుపోయాడు.

రాజుగారు తనకు అనుకూలంగా తీర్పు ఇవ్వటమేగాక, తన మీద ఆదరం కూడా చూపుతున్నందుకూ, తన ఎత్తు సులువుగా పారినందుకూ సోమనాథుడు అమిత ఆనందం పొందాడు.

అతనికి రాజభవనంలో ఒక మంచి గదిలో బస ఏర్పాటు చేశారు. అక్కడ అతనికి భోజనమూ, తాగుడూ సమకూర్చబడింది. అతను సుఖంగా తిని, తాగి, చల్లగాలి కోసం కిటికీ తెరిచి చూసేసరికి, అవతలి గదిలో సంకెళ్ళు వేసిన తారానాథుడు కనిపించాడు.

సోమనాథుడు అతన్ని పిలిచి, "ఎలాగూ నీ జీవితం ఖైదులో వెళ్ళిపోవలిసిందే. నువు నీ డబ్బు ఎక్కడ దాచావో చెప్పు?" అని అడిగాడు.

తారానాథుడు అతని వంక జాలిగా చూసి, "నా ఇంటి తూర్పు గదిలో నా ధన

మంతా రహస్యంగా దాచాను. అది తీసుకుని, ఇకనైనా దురలవాట్లు మాని సుఖంగా జీవించు," అన్నాడు.

మరుక్షణమే సోమనాథుడున్న గదిలోకి ఇద్దరు భటులు వచ్చి, అతన్ని పట్టుకు తీసుకుపోయారు.

మర్నాడు సభలో రాజుగారు సోమనాథుడికి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు. తారానాథుడి శిక్ష అలాగే ఉండిపోయింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, దొంగ ఎందుకు నవ్వాడు? అతను రాజుకు రహస్యంగా ఏం చెప్పి ఉంటాడు? సోమనాథుడే దోషి అనీ, తారానాథుడు నిర్దోషి అనీ తేలిపోయాక రాజు సోమనాథుణ్ణి శిక్షించటం భావ్యంగానే ఉన్నది గాని, తారానాథుడి శిక్ష ఎందుకు రద్దు చెయ్యలేదు? ఈ అనుమానాలకు తెలిసి కూడా సమాధానం చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "చచ్చేటట్టు దెబ్బలు తిన్నట్టు కనిపిస్తున్న తారానాథుడు తాను సోమనాథుణ్ణి కొట్టానంటే రాజు నమ్మి తీర్పు చెప్పినందుకు దొంగ నవ్వాడు. ఆ దొంగ రాజుతో తారానాథుడి జవాబులు నమ్మతగినవికావనీ, అసలు సంగతి మరో విధంగా విచారించమనీ చెప్పి ఉంటాడు. అందుకే రాజు నిజం తెలుసుకోవటానికి సోమనాథుడికి ఆతిథ్య మిచ్చాడు. సోమనాథుడితో బాటు రాజు తారానాథుణ్ణి కూడా ఎందుకు శిక్షించాడంటే ఇద్దరూ అన్యాయం కొనసాగటానికి సమంగానే పని చేశారు. సోమనాథుడి నేరం సఫలం కావటానికి తారానాథుడు చేతనయినదంతా చేశాడు. అందు చేత అతను శిక్షార్హుడు," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)

(సాదనాల చంటిబాబు రచన ఆధారంగా)





# రాజయోగం

పూర్వం ఒక గ్రామంలో ఆనందు డనే ఒక యువకుడుండే వాడు. అతనికి యుక్త వయసు రాగానే అతని తల్లి దండ్రులు అతని కొక సంబంధం చూశారు. పిల్ల పేరు లావణ్య. ఆమె చక్కనిదే, కాని ఆమెను పెళ్ళాడితే తనకు అచ్చి వస్తుందో రాదోనని, ఆనందుడు తనకు బాగా తెలిసిన ఒక జ్యోతిష్కుడి వద్దకు వెళ్ళి, ఆయన సలహా అడిగాడు.

జ్యోతిష్కుడు ఆనందుడి ద్వారా లావణ్యను గురించి తెలుసుకుని, "అబ్బాయీ, ఈ పిల్లను నువు వివాహం చేసుకునే పక్షంలో నువ్వామె పాదరక్షలు మోయవలిసి వస్తుంది; ఆమెను అమ్మా అని పిలవవలిసి వస్తుంది. కాని, కాపరానికి వచ్చినాక నువు ఏ పరిస్థితి లోనూ ఒక ఏడాదిపాటు ఆమెతో మాట్లాడకుండా ఉండాలి. అలా చేసినట్టయితే ఆమెద్వారా నీకు రాజయోగం కలుగుతుంది. ఇష్టమైతే ఆమెను పెళ్ళాడు, లేదా ఈ సంబంధం వదులుకుని మరొక సంబంధం చూసుకో," అన్నాడు.

ఆనందుడు జ్యోతిష్కుడు చెప్పిన మాటలు బాగా మననం చేసుకుని, లావణ్యను పెళ్ళాడటానికి నిశ్చయించాడు. వారిద్దరికీ వివాహం జరిగింది. అయితే తన భార్య కాపరానికి వచ్చినది మొదలు ఆనందుడు ఆమె కేసి చూడనైనా లేదు, ఆమెతో మాట్లాడలేదు.

తన భర్త ప్రవర్తన లావణ్యకు ఏ మాత్రమూ అర్థంకాలేదు. తన మీద అతనికి ఇష్టంలేదో, ఏ కారణం చేతనైనా తన మీద అతనికి కోపంవచ్చిందో లావణ్య తెలుసుకో లేక పోయింది. ఆమె అతన్ని సంతోష పెట్టటానికి ఎన్ని ప్రయత్నాలో చేసింది; అతనికి ఇష్టమైన వంటకాలు చేసి పెట్టింది; అతని దారికి అడ్డంగా నిలబడింది. ఎన్ని

ఏ. వీరేశం

చేసినా అతను మాట్లాడలేదు. అతన్ని మాట్లాడించటానికి విరుద్ధమైన పనులు కూడా చేసింది; కూరలో ఉప్పువేసేది కాదు; స్నానానికి మసులునీళ్ళు తోడి పెట్టేది. ఆమె ఏం చేసినా అతను భరించాడే గాని ఆమెతో మాట్లాడలేదు.

తనతో ప్రేమగా ఉండాలని భార్య చేసే ఈ ప్రయత్నాలు చూసి ఆనందుడికి జాలి కలిగింది. ఏడాది గడువు తీరేలోపుగా తాను నిగ్రహన్ని కోల్పోతానేమోనని భయంకలిగి, ఒకనాడు ఆనందుడు ఎవరికీ చెప్పకుండా ఇంటినుంచి వెళ్ళిపోయాడు. తరవాత అతని జాడలేదు. భర్త తనతో ఎందుకు ముభావంగా ఉన్నాడో తెలియని లావణ్య, అతను వెళ్ళిపోయాక కుంగిపోయింది.

ఇంతలో ఆ దేశంలో నీటిఎద్దడి సంభవించింది. నగరంలో ఉండే సరస్సుకు నీటినితెచ్చే వాగు ఎండి పోయింది. కొండ మీద నుంచి కిందికి ప్రవహించే ఆ వాగుకు ఒక కొండరాయి అడ్డంపడిందనీ, దాన్ని తొలగిస్తే చెరువులు నిండుతాయనీ అన్నారు. ఎందరోవచ్చి ఆ రాయిని పక్కకు నెట్టేందుకు రక రకాల ప్రయత్నాలు చేశారు. కాని ఆ రాయిని తొలగించటం వారిలో ఎవరి తరమూ కాలేదు.



భర్తతో కాపరం చేస్తూ కూడా బ్రహ్మచారిణిగా ఉండిన స్త్రీ తోస్తే ఆ రాయి పడిపోతుందని ఒక సిద్ధుడు చెప్పాడు. భర్త తనను విడిచిపెట్టి, దేశాలు పట్టిపోయినందుకు కుమిలిపోతున్న లావణ్యకు ఈ మాట వినపడగానే, రాజుగారి వద్దకు వెళ్ళి, "మహరాజా, ఏడాది క్రితం నేను కాపరానికి వచ్చాను. ఇంతవరకు నా భర్త నాతో పల్లెత్తుమాట అనలేదు. నీటిప్రవాహనికి అడ్డున్న రాయిని నేను తొలగించగలనేమో చూస్తాను," అన్నది.

ఆమెను చూసి రాజు ఆశ్చర్యపడి, "అమ్మా, నువు ఈ నీటి ఎద్దడి పోగొట్ట

గలిగితే నీకు నిశ్చయంగా అర్ధరాజ్యం ఇస్తాను. ప్రయత్నించి చూడు. సఫలమైతే ప్రజలు సుఖపడతారు," అన్నాడు.

రాజభటులు లావణ్యను కొండమీదికి తీసుకు వెళ్ళారు. ఆమె చెయ్యి తగలగానే కొండరాయి కదిలి కిందికి దొర్లిపోయింది. దానివెంబడే నీరు బయలుదేరి, కొండ దిగివచ్చి చెరువులను నింపేసింది.

అన్నప్రకారం రాజు లావణ్యను అర్థ రాజ్యానికి రాణిగా పట్టాభిషేకం చేశాడు. ఆమె సమస్త రాజలాంఛనాలతోనూ తన రాజ్యభాగాన్ని పాలించుకోసాగింది.

ఇది జరిగిన కొద్దిరోజులకు ఆనందుడు చినిగిన బట్టలతో, దుమ్ముకొట్టుకుని, బికారి రూపంలో, తన భార్య రాజ్యం చేస్తున్న నగరానికి వచ్చి, వీధిన నడవసాగాడు. అంతలో రాణీగారు రథంలో ఆ వీధిన రావటం తటస్థించింది. రథంలోనుంచి రాణి గారి పాదరక్ష కిందపడిపోయింది. వెంటనే ఆనందుడు దాన్ని తీసుకుని, రథం వెంబడి పరిగెత్తి, "అమ్మా, మీ పాదరక్ష కింద పడిపోయింది!" అంటూ ఆ పాదరక్షను ఆమె పాదంవద్ద ఉంచాడు.

లావణ్యను ఆనందుడు గుర్తించలేదు గాని, ఆమె తన భర్తను గుర్తించి, తన భర్త తనను ఈ విధంగా పలకరించినందుకు ఆశ్చర్యమూ, ఆనందమూ పొందింది. ఆమె రథం ఆపించి అతనిని కూడా ఎక్కించుకుని రాజభవనానికి తీసుకుపోయింది.

తనను వెంటతెచ్చినది రాణీ లావణ్య అని తెలిసి ఆనందుడి సంతోషానికి మేరలేదు. అతను తన వ్రతాన్ని నిలబెట్టుకున్నందుననే ఆమె రాణి కాగలిగింది. ఇప్పుడతను అసలు సంగతి అంతా ఆమెకు చెప్పి, ఆమె కుండిన అనుమానాలన్నీ పోగొట్టాడు. మర్నాడే ఆనందుడు రాజుగా ప్రజలకు పరిచయం చేయబడి, తన భార్యతో చాలాకాలం సుఖంగా రాజ్యంచేశాడు.






# అన్నదమ్ములు

ఒక వూళ్ళో పరంధామయ్య అనే ఆయన ఉండేవాడు. ఆయనకు ఇద్దరు కొడుకులు. రత్నాల్లాటి వాళ్ళు. పెద్దవాడి పేరు రామయ్యా, చిన్నవాడి పేరు లక్ష్మయ్యానూ.

వాళ్ళు నిజంగా రామలక్ష్మణులే. ఒకరంటే ఒకరికి పంచప్రాణాలు. వాళ్ళు పెద్దవాళ్ళయి పెళ్ళి చేసుకున్నారు. పెళ్ళాలు కాపరాలకు కూడా వచ్చారు.

కొంత కాలానికి వాళ్ళ తల్లి దండ్రులు పోయారు. అయినా ఆ అన్న దమ్ములు ఒకే కుటుంబంగా వుండి, తమ పొలాన్ని కలిసే చేసుకుంటున్నారు. అన్న భోజనానికి వెళ్ళినప్పుడు తమ్ముడు పొలం దగ్గిర ఉండే వాడు. తమ్ముడు భోజనానికి వెళ్ళినప్పుడు అన్న పొలందగ్గిర వుండేవాడు.

కాలం గడిచింది. రామయ్యకు సంతానం కలగలేదు. కాని తమ్ముడు లక్ష్మయ్య అయిదుగురు బిడ్డల తండ్రి అయాడు.

ఈ తేడాతోబాటు వాళ్ళ పెళ్ళాల మధ్య ఇంటి పని చెయ్యటం విషయంలో కలతలు ఆరంభమయాయి.

ఈ పోట్లాటలు వదిలించుకోవటానికి ఒకటే దారి కనిపించింది. అదేమిటంటే, ఇల్లూ, పొలమూ పంచేసుకుని, వేర్లు పడి పోవటం. రామయ్యా, లక్ష్మయ్యా ఆ పనే చేసేశారు. కాని వాళ్ళ మధ్య ఉండే ప్రేమాభిమానాలు మాత్రం ఏమీ చెడలేదు. పొలం దగ్గిర ఎప్పటిలాగే ఉండేవాళ్ళు.

ఒక ఏడు పొలాలు విరగపండాయి. అన్నదమ్ము లిద్దరూ పంటలు కోయించి, కుప్పలు నూర్పించి, ధాన్యం రాసులు పోయించారు. ఇంక ధాన్యాన్ని ఇళ్ళకు చేర్చటమే తరవాయి అన్నమాట.

ఆ రాత్రి రామయ్య పొలంలో రామయ్యా, లక్ష్మయ్య పొలంలో లక్ష్మయ్యా కాపలా ఉన్నారు.

దమ్ము శ్రీనివాసులు

భోజనం వేళకు రామయ్య తన తమ్ముణ్ణి పిలిచి, "తమ్ముడూ, నేను ఇంటికి వెళ్ళి అన్నం తిని వస్తాను. అందాకా నా కళ్ళం కూడా కాస్త చూస్తూ ఉండు. నేను వచ్చి నాక నువు వెళుదువుగాని," అన్నాడు.

లక్ష్మయ్య సరేనని అన్నను పంపేశాడు. అప్పుడు లక్ష్మయ్యకు ఇలా ఆలోచన వచ్చింది. తనకు ముగ్గురు కొడుకులూ, ఇద్దరు కూతుళ్ళూ ఉన్నారు. తన పెద్ద కొడుకు ఎలాగూ రెండు మూడేళ్ళలో చేతి కంది వస్తాడు. అప్పుడు తన పని చాలా తేలికవుతుంది. కాని, పాపం, తన అన్నకు పిల్లలు లేరు. వయసా పెరుగుతున్నది. పెద్దతనంలో సుఖపడాలంటే ఇప్పటి నుంచీ వెనకేసుకోవలిసినవాడు. ఆయనకు తను సహాయం చేస్తానంటే ఒప్పుకోడు. ఆయన ఒప్పుకున్నా తన పెళ్ళాం ఒప్పుకోదు.

ఇలా అనుకుని లక్ష్మయ్య గంప ఒకటి తీసుకుని. తన రాశిలో నుంచి పది గంపల ధాన్యం తన అన్నరాశిలోపోసేసి, ఏమీ ఎరగ నట్టు తన మంచం ఎక్కి కూర్చున్నాడు.

ఇంతలో రామయ్య భోంచేసి రానే వచ్చాడు. వచ్చి, లక్ష్మయ్యను భోజనానికి పంపాడు. లక్ష్మయ్య వెళ్ళాక రామయ్య ఆలోచనలో పడ్డాడు. ఈ యేడు పంట బాగానే పండింది. ఎంత పండినా లక్ష్మయ్య కేం లాభం? పెద్ద సంసారం. పిల్లలకు చదువులు, బట్టలు, ఖర్చు! తన దారి వేరు. తానూ, తన భార్యానూ! లక్ష్మయ్యకు సహాయం చెయ్యాలంటే ఈ ఏడు తనకు మంచి అవకాశం. కాని తాను ధాన్యం ఇస్తే వాడు తీసుకోడు. ఒకవేళ వాడు తీసుకున్నా తన పెళ్ళాం ఒప్పుకోదు. అందుచేత—

రామయ్య అటూ ఇటూ చూసి, లక్ష్మయ్య ఉపయోగించిన గంపతోనే పదిగంపల ధాన్యం తన రాశి నుంచి తీసి తమ్ముడి రాశిలో పోసి ఏమీ ఎరగనట్లు కూర్చున్నాడు!






# దురాశ

ఒక గ్రామంలో అమిత దురాశాపరుడూ, దుష్టుడూ అయిన భూస్వామి ఉండేవాడు. ఒక సంవత్సరం అతను నలభైఎకరాల మామిడితోట వేశాడు. మొక్కలకు నీళ్ళు పోయటానికీ. తోటకు కాపలా కాయటానికీ మనిషిని పెట్టదలచి, భూస్వామి రంగయ్య అనే పేదవాణ్ణి పిలిచి, "చూడు, రంగయ్యా! మామిడి మొక్కలు కాపుకు వచ్చేదాకా నీళ్ళు పోస్తూ కాపలాకాస్తూ ఉండినట్టయితే, అవి కాపుకు రాగానే నీకో నాలుగెకరాలిస్తాను," అన్నాడు.

రంగయ్య సరే నన్నాడు. అతను ఆ తోటలోనే చిన్న ఇల్లు వేసుకుని, మొక్కలకు నీళ్ళు పోస్తూ, తోటకు కాపలా కాస్తూ నాలుగేళ్ళు గడిపాడు. నాలుగోఏడు తోట కాపుకు వచ్చింది. రంగయ్య భూస్వామితో, "తోట కాపుకు వచ్చింది. వచ్చి చూచుకోండి," అన్నాడు.

భూస్వామి తనకున్న భూముల్లో ఎందుకూ పనికిరాని బంజరు నాలుగెకరాలు చూపించి, "ఇదే నేను నీ కివ్వదలచిన భూమి. దీన్ని సాగుచేసుకో," అన్నాడు రంగయ్యతో.

రంగయ్య భూస్వామితో, "నాలుగెకరాల మామిడితోట ఇస్తానని ఇలా మోసం చెయ్యటం ధర్మం కాదు. అన్నమాట ప్రకారం మామిడితోట ఇప్పించండి," అన్నాడు.

భూస్వామి రంగయ్యతో, "నేను నీకు నాలుగెకరాలు ఇస్తానన్నాను గాని, నాలుగెకరాల మామిడితోట ఇస్తాననలేదు. అదీ గాక తోట అంతా కాపుకు రాలేదు. కావలిస్తే చూడు," అంటూ పూతా, పిందే లేని రెండు గొడ్డుమోతు చెట్లను చూపించాడు.

చేసేదేమీలేక రంగయ్య, భూస్వామి చేసిన మోసానికి విచారిస్తూ ఇంటికి వెళ్ళాడు.

జి. సాంబిరెడ్డి



జరిగినదంతా విని రంగయ్య కొడుకు మండి పడ్డాడు. అతను భుస్వామికి తగిన గుణ పాఠం నేర్పాలని నిశ్చయించుకున్నాడు.

కొద్ది రోజులు గడవ నిచ్చి ఆ కుర్రవాడు తానొక సన్యాసి వేషం వేసుకుని, తన స్నేహితు లిద్దరికి శిష్యుల వేషాలు వేసి, తాను వెళ్ళి ఊరు బయట మర్రిచెట్టు కింద కూర్చుని, తన స్నేహితుల నిద్దరినీ ఊళ్లోకి పంపాడు.

వాళ్ళిద్దరూ ఊళ్ళో జనం మధ్య తిరుగుతూ, తమ గురువుగారు గొప్ప శక్తులు కలవాడనీ, కాశీకి వెళ్ళుతూ ఊరి బయట మర్రిచెట్టు కింద మకాం చేసి ఉన్నారనీ, కోరినవారు వెళ్ళి వారి దర్శనం చేసుకుని లాభం పొందవచ్చుననీ ప్రచారం చేశారు.

ఈ ప్రచారం విని చాలామంది గ్రామస్థులు పాలూ, పళ్ళూ పట్టుకుని ఆ సన్యాసి వద్దకు వెళ్ళారు. వారంతా తానెరిగినవారే కావటం చేత, రంగయ్య కొడుకు తాను దివ్య దృష్టితో తెలుసుకున్న వాడిలాగా నటిస్తూ, వారి కష్ట సుఖాలన్నీ మాట్లాడాడు. ఇందువల్ల సన్యాసి మీద అందరికీ అంతులేని గురికుదిరింది.

ఆ రోజు సాయంత్రం "శిష్యులు" మళ్ళీ గ్రామంలోకి వెళ్ళి, తమ గురువుగారు భూమిలో ఉండే నిధి నిక్షేపాల జాడలు చెప్పగలరని ప్రచారం చేశారు. ఈ ప్రచారం భూస్వామి చెవుల పడింది.

భూస్వామి ఆ రాత్రి బాగా చీకటి పడినాక పాలూ, పళ్ళూ, ఇతర కానుకలూ తీసుకుని, ఎవరూ లేని సమయంగా చూసి, మర్రిచెట్టు వద్దకు వెళ్ళి, సన్యాసి దర్శనం చేసుకుని, అతని కాళ్ళ పైన పడి, "నాకు నిధులున్న చోటు ఒక్కటైనా చూపించండి. వాటిని పూర్తిగా పుణ్యకార్యాలకే వెచ్చిస్తాను," అని వేడుకున్నాడు.

భూస్వామి చేత మళ్ళీ మళ్ళీ అడిగించుకుని సన్యాసి, బలవంతాన ఒప్పుకుంటున్నట్టు నటించి, భూస్వామిని వెంట బెట్టు

కుని పొలాల మీదికి బయలుదేరాడు. వాళ్లు, రంగయ్యకు భూస్వామి ఇచ్చిన బంజరు భూమిని చేరగానే, సన్యాసి ఒక చోట పెద్ద గిరి గీసి, అక్కడ నిలువు లోతు తవ్వితే అంతులేని బంగారం దొరుకుతుందని అతడికి చెప్పాడు.

ఆ సన్యాసి భూస్వామితో, "నేను తెల్ల వారుతూనే కాశీకి వెళ్ళిపోతున్నాను. మళ్ళీ ఇటుగా వచ్చే లోపుగా ఈ నిధితో ఒక శివాలయం కట్టించాలి!" అని చెప్పి భూస్వామిని పంపేసి, తన శిష్యులతో సహా అప్పుడే వెళ్ళిపోయాడు.

భూస్వామి తెల్లవారగానే రంగయ్యను పిలిపించి, "రంగయ్యా, నేను నీ కిచ్చిన బంజరు నాలుగెకరాలూ నాకే తిరిగి ఇచ్చెయ్యి. నువు పెద్ద వాడివి, ఆ బంజరు సాగు చెయ్యలేవు. నువు అడిగినట్టు నీకు నాలుగెకరాలు మామిడి తోటే ఇస్తాను, తీసుకో," అన్నాడు.

రంగయ్య తల అడ్డంగా తిప్పి, "వద్దు లెండి. నాకా బంజరే ఉండ నియ్యండి. మీరు నలభై ఎకరాల మామిడి తోట ఇచ్చినా నాకు వద్దు. దాన్ని మీరే ఉంచుకోండి," అన్నాడు.

భూస్వామి మథనపడిపోతూ, రంగయ్యతో బేరానికి దిగి, పది ఎకరాల మామిడి తోట యిస్తా నన్నాడు. తరవాత దాన్ని ఇరవై ఎకరాలు చేశాడు. చివరకు, రంగయ్య ఆ బంజరు పొలం వదులుకుంటే నలభై ఎకరాల మామిడి తోటా ఇచ్చేస్తానన్నాడు. అప్పుడు రంగయ్య దిగి వచ్చి, మామిడి తోటంతా తన పేర రాయించుకుని ఇంటికి వెళ్ళిపోయాడు.

భూస్వామి బంగారం గురించి కలలు కంటూ, సన్యాసి గిరి గీసిన చోట తవ్వించ నారంభించాడు. ఎంత లోతు తవ్వినా అక్కడ బంగారం ఏమీ దొరకలేదు భూస్వామికి.





# దిద్దుబాటు

ఒక అడవిలో ఒక ముని తపస్సు చేసు కుంటూ ఉండేవాడు. కట్టెలు కొట్టుకోవ టానికి అడవికి వచ్చేవాళ్ళు అతని ముందు పళ్ళూ, ఫలాలూ పెట్టి వెళ్ళిపోయేవాళ్ళు. ఆ ముని కళ్ళు తెరిచినప్పుడు ఎదురుగా ఏమైనా కనిపిస్తే తినేవాడు, లేనిపక్షంలో అడవిజంతువులు వాటిని తినేవి.

ఒకనాడు ఒక మనిషి టెంకాయల మూటతో అడవి మార్గంగా వెళుతూ, మునిని చూసి, నాలుగు టెంకాయలను ముని ముందు ఉంచి వెళ్ళిపోయాడు. కొంత సేపైన తరవాత ముని కళ్ళు తెరిచి టెంకా యలను చూసి, వాటిని పగలగొట్టే ఆలోచ నలో ఉండగా ఒక కట్టెలుకొట్టేవాడు అయ నను సమీపించి, తన గొడ్డలితో ఒక టెంకా యను కొట్టి మునికి ఇచ్చాడు. ముని ఆ టెంకాయలోని నీరు తాగి, కొబ్బరి తింటూండగా కట్టెలుకొట్టేవాడు మరొక టెంకాయ కొట్టబోయాడు. ముని వాణ్ణి వారించి, "వీటిని నువు తీసుకుపో. వాటిని కొట్టేటప్పుడు నువు ఏ కోరిక కోరుతావో అది సిద్ధిస్తుంది. నీ సంగతి నాకు బాగా తెలుసు," అన్నాడు.

కట్టెలుకొట్టేవాడు మునికి నమస్కారం చేసి, తన కట్టెలమోపుతోబాటు ముని ఇచ్చిన మూడు టెంకాయలనూ తీసుకుని ఇంటికి వెళ్ళాడు.

ఆ మనిషి పేరు గంగులు. అతను కట్టెలు అమ్మినదానిలో సగం ఖర్చుచేసి, కాలు భాగం దానంచేసి, మిగిలిన కాలు భాగం వెనకవేసుకునేవాడు. తన దగ్గిర ఎంత డబ్బుపోగయినా కట్టెలుకొట్టటం మానరాదని ప్రతిజ్ఞ చేసుకున్నాడు. తక్కువ డబ్బులు దొరికిననాడు దానంచేసే మొత్తం తగ్గిందని విచారించేవాడు కాని, తన ఖర్చుకు తగ్గిందని దిగులుపడేవాడు కాదు.

యు. సర్వేశ్వరరావు



గంగులు ఇంటికి వెళ్ళి, "నా నియమానికి భంగం రాకుండా, నేనూ, నా భార్యా, బిడ్డలూ సుఖంగా ఉండేటట్టు రోజులు గడవాలి!" అని కోరుకుని, ఒక టెంకాయ కొట్టాడు. అది మొదలు అతనికి కట్టెల వ్యాపారం బాగా కలిసివచ్చింది. కూడబెట్టిన ధనంతో కాస్త మంచి ఇల్లు కట్టుకుని, పూర్వం కన్న హెచ్చుగా దానధర్మాలు చేస్తూ, భార్యా బిడ్డలతో అతను సుఖంగా జీవించసాగాడు. అతన్ని అందరూ "గంగయ్యగారు" అని ఎంతో గౌరవంగా కూడా పిలవసాగారు.

గంగులు ఇంటి సమీపంలో ఒక శ్రీమంతుడుండేవాడు. కట్టెలుకొట్టే గంగులు తనను మించి దానధర్మాలు ఎలా చేస్తున్నాడో, ఎలా కీర్తి సంపాదిస్తున్నాడో ఆ శ్రీమంతుడికి అర్థం కాలేదు. ఆయనకు గంగులు మీద ఎక్కడలేని ఈర్ష్యా, ఆశ్చర్యమూ కూడా కలిగాయి.

ఒకనాడా శ్రీమంతుడు గంగులుతో, "చూడు, గంగయ్యా. నువు చక్కగా అభివృద్ధిలోకి వచ్చావు. నాకు చాలా సంతోషంగా ఉంది. అయితే, నువ్వేమీ అనుకోకుండా ఉంటే, కుతూహలం కొద్దీ ఒక్క మాట అడుగుతాను—నీకు అడవిలో ఏదన్నా నిధిగాని దొరికిందా ఏమిటి?" అని అడిగాడు.

"అదేమీ లేదండీ. అంతా ఒక ముని చలవ!" అంటూ, కపటం ఎరగని గంగులు జరిగినదంతా వివరంగా చెప్పాడు.

"అయితే నీ దగ్గిర ఇంకా రెండు టెంకాయలున్నాయన్న మాట! ఏమి అదృష్టం! వాటిని చూడాలని కుతూహలంగా ఉంది. రేపు మీ యింటికి వస్తే చూపిస్తావు కదూ?" అన్నాడు శ్రీమంతుడు. గంగులు అలాగే నన్నాడు.

మర్నాడు శ్రీమంతుడు తన బట్టలో ఒక మామూలు టెంకాయ దాచుకుని వెళ్ళి,

గంగులు తెచ్చిచూపిన రెండు టెంకాయలనూ చాలాసేపు పరీక్షించి, గంగులు చూడకుండా వాటిలో ఒకటి సంగ్రహించి, దాని స్థానంలో తాను తెచ్చిన టెంకాయ ఉంచి, చల్లగా ఇంటికి తిరిగివచ్చాడు.

చాలా డబ్బు కావాలని కోరుకోవటానికి నిశ్చయించి ఆయన మహిమగల టెంకాయ కొట్టబోతుండగా శ్రీమంతుడి భార్య, "నీళ్ళు ఇందులో పొయ్యండి!" అంటూ ఒక లోటా తెచ్చింది.

ఆ శ్రీమంతుడికి తన భార్య అడ్డం వచ్చినప్పుడల్లా, "దరిద్రం!" అనటం అలవాటు. ఆ అలవాటు చొప్పున, "చాలా ధనం కావాలి" అనబోయినవాడల్లా, "చాలా దరిద్రం కావాలి!" అని గట్టిగా అని టెంకాయ కొట్టేశాడు.

తరవాత ఆయన తన పొరపాటు తెలుసుకుని, తనచేత అలా అనిపించిన భార్యను నానాతిట్లూ తిట్టాడు.

కాని పొరపాటు జరిగిపోయింది. శ్రీమంతుడి సంపద క్రమంగా క్షీణించసాగింది. చేసే ఖర్చేదీ కలిసిరాలేదు. ఆయన ఇంట దొంగలు పడి దోచుకున్నారు. చివరకు ఆయన తన అభిమానం చంపుకుని గంగులు వద్ద దానం పుచ్చుకోవలసిన దుస్థితి కూడా ఏర్పడింది.

అప్పుడాయన గంగులు వద్దకు వెళ్ళి, తాను చేసిన టెంకాయ దొంగతనం గురించి చెప్పి, క్షమాపణ చెప్పుకున్నాడు.

అంతా విని గంగులు, "నా దగ్గిర ఉన్న రెండు టెంకాయలలో ఒకటి మహిమ గలదే కద. విచారించకండి. దాన్ని మీ కోసం కొట్టేద్దాం!" అన్నాడు.

ఆ విధంగా గంగులు సహాయంతో శ్రీమంతుడు ముందున్నదాని కన్న కూడా ధనికుడై, తాను కూడా గంగులులాగా దానధర్మాలు చేస్తూ, ఆ చుట్టుపక్కల పేరు సంపాదించుకున్నాడు.






# ఫలించినకల

ఒక రాజుగారు తన నగరంలోని పెద్ద కమసాలిని పిలిపించి, అతనికి కొంత బంగారమూ, రెండు వజ్రాలూ ఇచ్చి, వాటితో రెండు ఉంగరాలు చేయమని ఆజ్ఞాపించాడు.

కమసాలిపెద్ద తన దుకాణానికి వచ్చి, తనకింద పని నేర్చుకునే రాఘవుడనే కుర్రవాడితో, "ఒరే, రాజుగారు ఉంగరాలు చెయ్యమన్నారు. నేను ఇంటికి పోయి, భోజనంచేసి వచ్చి, పని ప్రారంభిస్తాను. అంతదాకా నువు ఈ బంగారాన్నీ, రాళ్ళనూ జాగ్రత్తగా చూస్తూఉండు!" అని వెళ్ళిపోయాడు. యజమాని వెళ్ళిన కాస్సేపటికి రాఘవుడికి నిద్రముంచుకు వచ్చింది. వాడు తన ముందున్న బల్ల మీద తల ఆనించి నిద్రలో పడిపోయాడు.

అదేసమయంలో రాజుగారు మారువేషంలో నగరం చుట్టబెడుతూ పెద్ద కమసాలి అంగడిలో పని కుర్రవాడు నిద్రపోతూండటం గమనించి, అంగడిలోకి వచ్చి, రాఘవుడి వీపుమీద గట్టిగా చరిచి, బయటికి వచ్చేశాడు.

"ఎవడురా నువ్వూ? బంగారమంటి కల కాస్తా పాడుచేశావూ?" అంటూ రాఘవుడు నిద్రలేచాడు.

వాడన్న మాటలు రాజు విన్నాడు. ఆయన తన భవనానికి తిరిగి వెళ్ళి, పెద్ద కమసాలి వద్ద పనినేర్చుకునే కుర్రవాడిని పట్టుకు రమ్మని తన భటులను పంపాడు. ఆయనకు ఆ కుర్రవాడి కల గురించి తెలుసుకోవాలనిపించింది.

రాఘవుడు రాజు ఎదట నిలబడ్డాడు.

"ఒరే, నీకు దుకాణంలో వచ్చిన కల ఏమిటి?" అని రాజు వాణ్ణి అడిగాడు.

"ఆ కల నిజమైతే తప్ప చెప్పటానికి వీల్లేదు, మహారాజా!" అన్నాడు రాఘవుడు.

ఎల్. రమణారావు



"చెప్పకపోతే చిక్కులో పడతావు." అన్నాడు రాజు.

"తమరు నన్ను చంపండి, కాని ఆ కల చెప్పటానికి లేదు," అన్నాడు రాఘవుడు.

"వీణ్ణి చీకటి కొట్టులో పెట్టండి," అన్నాడు రాజు.

రాఘవుడికి చీకటి కొట్టు దుర్భర మనిపించింది. అయినా మర్నాడు రాజు వాణ్ణి పిలిపించి, కల ఏమిటో చెప్పమంటే వాడు చెప్పలేదు.

రాజు వాణ్ణి తిరిగి చీకటి కొట్టుకు పంపుతూ, వాడికి తిండీ, నీరూ ఇవ్వవద్దు అని భటులతో అన్నాడు.



రాఘవుడు చీకటి కొట్టు నుంచి పారిపోవటానికి మార్గం వెతికాడు. వాడి కొక కర్ర దొరికింది. ఆ కర్రతో నేల తవ్వి, తాను దూరేపాటి సొరంగం చేసి, దానికుండా బయటికి వచ్చాడు. సమీపంలోనే రాజ భవనం ఉన్నది. ఒక కిటికీ అంచు పట్టుకుని పైకి ఎక్కి, ఒక గదిలోకి దిగాడు.

అది రాజకుమార్తె ఉండే గది. ఆమె మంచంమీద కళ్ళు మూసుకుని పడుకుని ఉన్నది. ఆమెకు సమీపంగా ఒక బల్ల మీద బంగారు కంచంలో భోజనం ఉన్నది. రాఘవుడు చప్పుడు చేయకుండా వెళ్ళి, ఆ పళ్ళెంలోని ఆహారం తినేసి, రాజకుమార్తెను చూశాడు. ఆమె ఎంతో అందంగా ఉన్నది. ఆమె మీద అతనికి ఎంతో ప్రేమ కలిగింది.

అతను వెళ్ళిపోబోతుండగా రాజకుమార్తె కళ్ళు తెరిచి, "ఎవరు నువు? నా గదిలోకి రావటానికి నీకు ఎన్ని గుండెలు! మా నాన్నతో చెప్పి నీ తల తీయిస్తాను," అన్నది.

"రాజకుమారీ, నా ప్రాణాలు తీయాలంటే మీ నాన్న కూడా దేనికి? ఆ పని నీ చేతిమీదుగానే కానీ. నేను నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానో నీకు తెలియదు!" అన్నాడు రాఘవుడు.



ఆ మాట రాజకుమార్తెకు నచ్చింది. ఆమె అతని విషయమంతా తెలుసుకున్నది. రాఘవుడు చాలాసేపు ఆమెతో గడిపి, వచ్చిన దారినే తన చీకటి కొట్టుకు తిరిగి వెళ్ళాడు.

అదిమొదలు రాఘవుడు ప్రతి రాత్రీ రాజకుమార్తె వద్దకు వెళ్ళి, ఆమెతో కలిసి భోజనం చేసి, తిరిగి రాసాగాడు.

ఇంతలో రాజుకు ఒక పెద్ద సమస్య వచ్చింది. ఒకనాడు చక్రవర్తి తన దూతలను రాజు వద్దకు పంపాడు. వారి వెంట మూడు గుర్రాలున్నాయి.

"ఈ గుర్రాల వయసు చెబుతారో, లేక మా చక్రవర్తికి ఓడిపోయినట్టు ఒప్పుకుంటారో చెప్పండి. ఈ రెండూ జరగని పక్షంలో మా చక్రవర్తిగారు మీ మీదికి దండెత్తి వచ్చి, మీ రాజ్యాన్ని నిర్మూలిస్తారు." అని దూతలు రాజుతో అన్నారు.

రాజు వద్ద కొలువున్న వారెవరూ గుర్రాల వయసు చెప్పలేమన్నారు. రాజు తన కుమార్తెనడిగాడు. ఆమెకు గుర్రాల వయసు తెలుసుకునే పద్ధతి తెలిసి ఉండి కూడా తనకు తెలియదని చెప్పి, ఆ రాత్రి తన వద్దకు వచ్చినప్పుడు ఆ కిటుకు రాఘవుడికి చెప్పింది.

రాజుకు అకస్మాత్తుగా రాఘవుడు గుర్తుకు వచ్చాడు. వాడు బతికి ఉన్నాడేమో చూసి,






బతికి ఉంటే తన వద్దకు తీసుకు రమ్మని రాజు భటులకు చెప్పాడు.

రాఘవుడు బతికి ఉండటమే గాక, దృఢంగా కూడా ఉన్నాడు.

"ఈ గుర్రాల వయసు తెలుసుకోగలవా?" అన్నాడు రాజు.

"తెలుసుకోగలను. వాటికి యవధాన్యం పెట్టించండి," అన్నాడు రాఘవుడు.

మూడు గుర్రాల ముందూ యవధాన్యం తెచ్చి పెట్టారు. మొదటిది ధాన్యమంతా తినేసింది. రెండోది సగం తిని వదిలేసింది. మూడోది ధాన్యం కుమ్మిందిగాని తినలేదు. "మొదటి గుర్రం వయసు మూడేళ్ళు. రెండోది రెండేళ్ళది. మూడోది ఏడాది వయసుది," అన్నాడు రాఘవుడు.

వాడు చెప్పినది నిజమేనని ఒప్పుకుని చక్రవర్తి దూతలు వెళ్ళిపోయారు.

రాజు రాఘవుడితో, "కుర్రవాడివి. సుఖంగా జీవించవలసినవాడివి. నీ కల ఏమిటో ఇప్పుడైనా చెప్పు, నిన్ను వదిలేస్తాను," అన్నాడు.

"మహారాజా, క్షమించండి. ఆ కల ఇప్పుడు చెప్పను," అన్నాడు రాఘవుడు.

రాజు వాణ్ణి తిరిగి చీకటి కొట్టుకు పంపించేశాడు.

ఏడాది గడిచింది. చక్రవర్తి దూతలు మళ్ళీ వచ్చారు. ఈసారి వాళ్ళు మూడు పళ్ళు తెచ్చి, వాటి వయసు చెప్పమనీ, చెప్పకపోతే ఓటమి ఒప్పుకోమనీ అన్నారు. మూడు పళ్ళూ ఒకేలాగున్నాయి. వాటి వయసు నిర్ణయించటం ఎవరివల్లా కాదని తేలినాక రాజు తన కూతుర్ని అడిగాడు. ఆమె తనకు తెలియదని తండ్రికి చెప్పి, వాటి వయసు తెలుసుకునే పద్ధతి రాఘవుడికి చెప్పింది.

తప్పనిసరి అయి రాజు రాఘవుణ్ణి పిలిపించి, "ఈ పళ్ళు ఎంత వయసుగలవో చెప్పగలవా?" అన్నాడు.



రాఘవుడు నీరు తెప్పించి మూడు పళ్ళనూ నీటిలో వేశాడు. ఒకటి నీటి అడుగుకు దిగిపోయింది. రెండోది సగం లోతుకు మునిగి పైకి తేలింది. మూడోది అసలు మునగనేలేదు.

"మొదటి పండు వయసు ఒక ఏడు. రెండో దాని వయసు రెండేళ్ళు. మూడోదాని వయసు మూడేళ్ళు." అన్నాడు రాఘవుడు.

చక్రవర్తి దూతలు అతనన్నది నిజమని ఒప్పుకుని తిరిగి వెళ్ళిపోయారు.

"నిష్కారణంగా ఎందుకు చెడతావు? నీ కల ఏమిటో చెప్పి, చీకటికొట్టు నుంచి బయటపడరాదా?" అన్నాడు రాజు రాఘవుడితో.

"మహారాజా, ఎందు కడుగుతారు? నేను చెప్పనని తమకు తెలుసు." అన్నాడు రాఘవుడు.

రాజు వాణ్ణి మళ్ళీ చీకటి కొట్టుకు పంపాడు.

మళ్ళీ సంవత్సరం తిరిగేసరికల్లా చక్రవర్తి దూతలు పన్నెండుమంది చిన్నపిల్లలను వెంటబెట్టుకు వచ్చి, "రాజా, వీరిలో ఆడపిల్లలెవరో, మగపిల్లలెవరో వివరించి చెప్పు. లేదా, ఓటమి ఒప్పుకో." అన్నారు. అందరు పిల్లలూ ఒకే విధమైన దుస్తులు



ధరించి, మగపిల్లలైనదీ, ఆడపిల్లలైనదీ తెలియరాకుండా ఉన్నారు.

రాజు వణికిపోయాడు. ఆయన తన కూతుర్ని అడిగితే, ఆమె తనకు తెలియదని చెప్పి, ఆడపిల్లలను ఎలా గుర్తించాలో రాఘవుడికి చెప్పింది.

రాజు తప్పనిసరిగా రాఘవుణ్ణి చీకటి కొట్టు నుంచి తెప్పించి, "ఈ పిల్లలలో మగపిల్లలనూ, ఆడపిల్లలనూ, వేరు చేయగలవా?" అని అడిగాడు.

"వేరు చేస్తాను, మహారాజా! కాని ముందు నేను కోరేది ఇస్తానని మీరు మాట ఇవ్వాలి!" అన్నాడు రాఘవుడు.





"కోరుకోరా, బాబూ! నా రాజ్యం ఇవ్వమన్నా ఇస్తాను, ఇది నాశనం కాకుండా ఉంటే అంతే చాలు," అన్నాడు రాజు.

"మీకు అందాలరాశి అయిన కుమార్తె ఉన్నదని విన్నాను. ఆమెను నా కిచ్చి వివాహం చెయ్యాలి," అన్నాడు రాఘవుడు.

"ఈ ఆపద తప్పితే అలాగే చేస్తాను," అన్నాడు రాజు.

రాఘవుడు పిల్లలందరినీ భోజనాలకు సిద్ధం కమ్మని, వాళ్ళు చేతులు కడుగు కోవటానికి ఉడుకునీళ్ళు పోశాడు. పన్నెండు మందిలోనూ ఆరుగురు నీటి వేడి భరించ లేక బాధపడ్డారు. మిగిలిన ఆరుగురూ భరించారు. మొదటి ఆరుగురూ మగపిల్లలనీ, మిగిలిన ఆరుగురూ ఆడపిల్లలనీ రాఘవుడు తేల్చి చెప్పాడు.

"నిజం!" అని చక్రవర్తి దూతలు శలవు పుచ్చుకున్నారు.

రాజు తన కుమార్తెను రాఘవుడి కిచ్చి పెళ్ళిచేసి, వాణ్ణి తన అల్లుణ్ణి చేసుకున్నాడు.

ఈ లోపల చక్రవర్తికి ఒక ఆలోచన కలిగింది. తాను పంపే సమస్యలను విడదీస్తున్న కుర్రవాడు ఏదో విధంగా నాశనమైతే తప్ప రాజు తనకు లొంగిరాడని ఆయనకు తోచింది.

అందుచేత ఆయన రాఘవుణ్ణి తన రాజధానికి ఆహ్వానించి, "నువు చాలా తెలివిగలవాడివని మా దూతలు చెప్పారు. నీ తెలివితేటలకు పరీక్ష పెట్ట దలిచాను. ఈ ఇనపముక్కతో ఒక పట్టుబట్ట అల్లి తీసుకురా. మూడు రోజులలోగా ఆ పని చేశావంటే నీకు నా కుమార్తె నిచ్చి పెళ్ళిచేస్తాను. ఆ పని చెయ్యలేకపోతే నీ తల తీయిస్తాను," అన్నాడు.

చక్రవర్తి తనను చంపటానికి ఎత్తు వేశాడని రాఘవుడికి స్పష్టమయింది. ఏదన్నా యుక్తి చెప్పడానికైనా సమయానికి తన భార్య దగ్గిర లేదు.

అతను ఆలోచిస్తూ రాజభవనం పక్కన గల తోటలో పచార్లు చేస్తూండగా చక్రవర్తి కూతురు అత నున్న చోటికి వచ్చి, "ఏమిటి విచారంగా ఉన్నావు?" అని అడిగింది.

ఆమె రాఘవుణ్ణి అంతకుపూర్వమే చూసి, తన భర్తగా వరించింది.

"చక్రవర్తిగారు నా కొక ఇనపముక్క ఇచ్చి, దానితో పట్టుబట్ట నేసి తెమ్మన్నారు. మూడురోజుల లోపల నే నా పని చెయ్యక పోతే నా తల పోతుంది," అన్నాడు రాఘవుడు.

"నువ్వొక పనిచెయ్యి. రాజుగారి వద్దకు కుంచెడు ఇసుక తీసుకుపోయి, దాన్ని దారంగా పేనించి ఇచ్చినట్టయితే పట్టుబట్ట నేస్తానను," అన్నది చక్రవర్తి కుమార్తె.

రాఘవుడు అదే చేశాడు.

చక్రవర్తి నిర్ఘాంతపోయి, "ఇసుకను ఎలా పేనటం?" అన్నాడు.

"ఇనుము నుంచి పట్టుబట్ట తయారు చేయటం మాత్రం ఎలా?" అన్నాడు రాఘవుడు.

"నువే గెలిచావు. నా కుమార్తెను నీ కిచ్చి పెళ్ళిచేస్తాను," అన్నాడు చక్రవర్తి.

రాఘవుడు చక్రవర్తి కూతురిని పెళ్ళాడి, ఆమెతో సహా తిరిగి వచ్చి, "మహారాజా, నేను ఆనాడు దుకాణంలో కన్న కల ఇప్పుడు చెబుతాను. నేను ఉద్యాన వనంలో ఉన్నానట. నాకు ఒక పక్క మీ కుమార్తే, ఇంకో పక్క చక్రవర్తి కుమార్తే కూర్చుని ఉన్నారట. ఈ కల మీకు ఆనాడే చెబితే అది నిజమయి ఉండేదేనా?" అన్నాడు రాజుతో.

"బాబూ, నువు వివేకం గలవాడివి. చక్రవర్తికి అల్లుడి వయావు గనక నా రాజ్యానికి శత్రుభయం మరి లేదు. ఇక నువే సింహాసనం మీద కూర్చో!" అని రాజు రాఘవుడికి రాజ్యాభిషేకం చేసేశాడు.






# మాట్లాడే పండు

ఒక రాజుగారి వద్ద లెక్కలేనన్ని ఆవులు ఉండేవి. రోజూ పశువులకాపర్లు ఆవులను కొండ ప్రాంతంలో వున్న పచ్చికబీళ్ళకు తోలుకొని వెళ్ళేవారు. కాని సాయంత్రం ఇంటికి తిరిగి వచ్చేసరికి వాటి సంఖ్య తగ్గి ఉండేది. రాజుగారు ఎంత గట్టి కాపలాలు ఉంచినా ఆవులు మాయమవడం మాత్రం మానలేదు. మాయమవుతున్న ఆవుల ఆచూకీ తెలుసుకుని రమ్మని రాజుగారు తన ముగ్గురు కొడుకులనూ పంపాడు.

రాజకుమారులు ఒక రోజల్లా ప్రయాణం ఒక అరణ్యం చేరుకున్నారు. అక్కడ వాళ్లకు ఒక వికారాకారం గల స్త్రీ ఎదురుపడి, "నాయనలారా, ఎక్కడికి వెళుతున్నారు?" అని అడిగింది.

అందుకు రాజకుమారులు విసుక్కుని, "మేము ఎక్కడికి వెళితే నీ కేం? నీ దారిన నువు వెళ్ళు!" అన్నారు.

ఆ స్త్రీ ఏదో గొణుక్కుంటూ వెళ్ళిపోయింది. రాజకుమారులు ముందుకు నడిచి, చీకటి పడేవేళకు ఒక కోటను చేరుకున్నారు. కోట లోపల తమ ఆవులన్నీ కట్టివేసి ఉండటం వారికి కనిపించింది. ఇంకా లోపలికి పోగా, నిద్రపోతున్న అతిముసలి రాక్షసి కనిపించింది. వారి అలికిడికి ఆ రాక్షసి మేలుకున్నది.

రాజకుమారులు ధైర్యంచేసి, "అవ్వా, మా కేదన్నా పని ఇప్పించు. ఇక్కడే ఉంటాం," అన్నారు.

వాళ్ళు ఆవుల కోసమే వచ్చారని రాక్షసి గ్రహించింది. అది చాలా జిత్తులమారిది. తన ఒంట్లో శక్తి ఉడిగిపోయాక తన మాయోపాయాల చేతనే తన శత్రువులను చంపుతూ వస్తున్నది. అది రాజకుమారులను కూడా అలాగే చంప నిశ్చయించుకుని, "సరే, అబ్బాయిలూ! ఆ ఆవులను పాలుపిండే వేళ

జి. నిర్మల

అయింది. వెళ్ళి పాలు పితుక్కురండి. రేపటి నుంచీ నా ఆవుల పాలనా, పోషణా అంతా మీదే," అన్నది.

రాజకుమారులు సరే నని వెళ్ళి, గంగాళాల నిండా పాలు పితుక్కుని వచ్చారు.

రాక్షసి పాలను కాస్తూ ఉంటే, రాజకుమారులు బయట చేరి, ఆవులను తప్పించడం గురించి ఆలోచించసాగారు.

ఇంతలో రాక్షసి వాళ్ళను పిలిచి, "అబ్బాయిలూ, ఆకలితో ఉన్నారేమో, ముందు ఈ పాలు తాగండి," అని మూడు పాత్రలలో విషం కలిపిన పాలు ఇచ్చింది. రాజకుమారులు ఆ సంగతి ఎరగక, పాలు తాగి మరణించారు. రాక్షసి ఆ ముగ్గురినీ ఒక పెట్టెలో దాచింది.

తన కొడుకులు ఎన్నాళ్ళకూ తిరిగి రాకపోయేసరికి రాజుగారికి దిగులు పట్టుకున్నది. రాజుగారి పశువులకాపర్లలో గోవిందు అనే యువకుడు ఉండేవాడు. వాడు ధైర్యంచేసి రాజుగారి వద్దకు వెళ్ళి, రాజకుమారుల జాడా, మాయమైన ఆవుల జాడా కనుక్కువస్తా నన్నాడు. రాజుగారు సరే నన్నారు.

గోవిందుడు కూడా రాజకుమారులు వెళ్ళిన దారినే బయలుదేరాడు. వాడికి కూడా వికారాకారం గల స్త్రీ కనిపించి,




"నాయనా, ఎక్కడికి వెళుతున్నావు?" అని అడిగింది.

గోవిందు డామెకు తను వెళుతున్న పని గురించి చెప్పాడు.

అందు కామె, "ఇంకా కొంత దూరం వెళ్ళావంటే నీ కొక కోట కనిపిస్తుంది. అందులో ఒక జిత్తులమారి ముసలిరాక్షసి ఉన్నది. నా చెల్లెలి సహాయంతో అదే మీ రాజుగారి ఆవులను కాజేసింది. అవసరం తీరినాక అది నా చెల్లెల్ని చంపేసింది. ఈ పాటి కది మీ రాజుగారి కొడుకులను కూడా చంపే ఉంటుంది. వాళ్ళకి ఈ విషయం ముందే చెబుదా మనుకున్నాను



గాని, పలకరిస్తే నా మీద చిరాకుపడి వాళ్లు వెళ్ళిపోయారు," అన్నది.

గోవిందుడు ఆమెతో, "నీ చెల్లెలు ఎవరు? ఆ రాక్షసికి మా ఆవులను కాజెయ్యాలిసిన అవసర మేమిటి?" అన్నాడు.

అందు కామె, "ఆ రాక్షసికి ముసలి వయసులో పొట్టగడవటం కష్టమయింది. మీ రాజుగారి ఆవుల మీద దాని కన్ను పడ్డది. మా చెల్లెలు ఒక మంత్రగత్తె. ఆ రాక్షసి మా చెల్లెలితో మెల్లగా స్నేహం చేసింది. రాజుగారి ఆవుల్లో సగం వాటా ఇస్తానని చెప్పి, మా చెల్లెలి సహాయంతో ఆవులను మాయం చేయించి తన కోటకు చేర్పించు కున్నది. అవసరం తీరాక అది మా చెల్లెల్ని చంపేసింది. అన్యాయంగా మా చెల్లెల్ని చంపినందుకు నా కా రాక్షసి మీద చాలా కసిగా ఉన్నది. నేనా ముసలిదాన్ని, నా మంత్రశక్తులా ఏనాడో పోయాయి. నీలాటి వాళ్ళు కనిపిస్తే వాళ్ళ సహాయంతో రాక్షసి మీద పగ తీర్చుకుందామని చూస్తు న్నాను," అన్నది.

అంతా విని గోవిందుడు, "ఆ రాక్షసి బారి నుండి రాజకుమారులనూ, మా ఆవు లనూ కాపాడుకునే మార్గం ఉంటే చెప్పు," అన్నాడు.

"మంత్రశక్తులు పోయినా నా దగ్గిర ఇంకా రెండు వస్తువులు మిగిలి ఉన్నాయి," అంటూ ఒక పండూ, మూడు రాళ్ళూ గోవిందుడి చేతిలో పెట్టి, ఆ వికారాకారం గల స్త్రీ, "ఈ పండు నీకు రాబోయే అపాయం గురించి ముందే చెబుతుంది. ఇది మాట్లాడే పండు. దీనితో నీ అవసరం తీరిపోయాక ఈ పండులోని విత్తు తీసి, నీటిలో అరగదీసి చనిపోయినవారిమీద చల్లితే వాళ్ళు తిరిగి బతుకుతారు. ఈ రాళ్ళు కింద వేసి ఏమి కావాలంటే అది అవుతాయి. నువు రాక్షసిని చంపుతావని నాకు నమ్మకం ఉంది. వెళ్ళిరా, నాయనా!" అన్నది.



ఆమె ఇచ్చిన వస్తువులను తీసుకుని గోవిందుడు కోట కేసి బయలుదేరాడు. కోటను చేరుకుని, ముసలి రాక్షసిని చూసి, గోవిందుడు తన కేదన్నా పని ఇప్పించ మన్నాడు.

వీడు కూడా ఆవుల కోసమే వచ్చాడని పసికట్టి రాక్షసి, "సరే, నా ఆవులను చూసు కుంటూ ఉండు," అని లోపలికి వెళ్ళి పాలు తెచ్చి, ఎంతో అప్యాయంగా వాణ్ణి తాగమన్నది.

"తాగకు! అందులో విషం ఉన్నది!" అని పండు గోవిందుణ్ణి హెచ్చరించింది.

రాక్షసి కన్ను కప్పి గోవిందు డాపాలను అవతల పారబోశాడు.

పాలు తాగి కూడా గోవిందుడు బతికే ఉన్నందుకు రాక్షసి ఆశ్చర్యపోయి, "అక్కడ పడక ఉన్నది. వెళ్ళి పడుకో. చాలా పొద్దుపోయింది," అన్నది.

"పడుకోకు. కందకంలో పడతావు," అని పండు గోవిందుణ్ణి హెచ్చరించింది.

రాక్షసి వెళ్ళిపోయాక గోవిందుడు పడక ఎత్తి చూస్తే దాని కింద ముళ్ళకంచెలతో నిండిన లోతైన గొయ్యి కనిపించింది. రెండోసారి తన ప్రాణం దక్కినందుకు గోవిందుడు సంతోషించాడు. రాక్షసి మటుకు




గోవిందుడు చచ్చాడే అనుకుని, నిశ్చింతగా నిద్రపోయింది.

గోవిందుడు రాజకుమారుల కోసం కోట అంతా గాలించాడు. వాడికి రాజకుమారుల శవాలున్న పెట్టె కనబడింది. వికారాకారం గల స్త్రీ చెల్లెలి శవం మాత్రం కనిపించ లేదు. రాజకుమారుల శవాలను మోసుకు పోవటం సాధ్యం కాదు. అందు చేత వాడు ఇక తనకు పండు అవసరం ఉండదని నిశ్చయించుకుని, దాని విత్తనం తీసి నీటిలో అరగదీసి, ఆ నీళ్ళు రాజ కుమారులపై చల్లాడు. వాళ్ళు వెంటనే బతికి, గోవిందుణ్ణి గుర్తుపట్టారు.

తరవాత నలుగురూ కలిసి పశువుల కొట్టానికి వెళ్ళి, పశువులను విడిపించి, వాటిని తోలుకుంటూ కోట దాటారు. గోవిందుడు వికారాకారం గల స్త్రీకోసం చూశాడు గాని ఆమె ఎక్కడా కనిపించలేదు.

ఈలోగా రాక్షసి లేచి, గోవిందుడి పక్క చెక్కుచెదరకుండా ఉండటం గమనించి, అనుమానం వచ్చి పశువుల కొట్టం కేసి వెళ్ళింది. పశువులు లేవు. గోవిందుడు వాటిని విడిపించుకు వెళ్ళాడని గ్రహించి, పెడబొబ్బలు పెట్టుకుంటూ వచ్చింది.

రాజకుమారులూ, గోవిందుడూ రాకసి అరుపులు విన్నారు. అది పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ సమీపిస్తున్నది. గోవిందుడికి తన వద్ద ఉన్న రాళ్ళు జ్ఞాపకం వచ్చాయి. వాడొక రాయి తీసి వెనక్కు విసురుతూ, ముళ్ళకంచెలు అయిపోవాలనుకున్నాడు.

ముళ్ళకంచెల మధ్య చిక్కుకుపోయిన రాక్షసి అతి ప్రయాసతో వాటిని దాటి మళ్ళీ రాసాగింది. ఆమె దగ్గిరదాకా వచ్చాక గోవిందుడు మరొక రాయి విసిరాడు. వెంటనే రాక్షసి మంటల మధ్య చిక్కుకున్నది. ఆ మంటలు చల్లారేదాకా రాక్షసి కదలలేకపోయింది. ఈలోపుగా రాజకుమారులూ, గోవిందుడూ చాలా దూరం వెళ్ళారు.

మరొకసారి రాక్షసి తమని సమీపిస్తూ ఉండటం చూసి గోవిందుడు తన వద్ద ఉన్న మూడోరాయి కూడా విసిరాడు. అది ఒక వాగులో పడింది. మరుక్షణమే వాగు పొంగ నారంభించింది. అయినా రాక్షసి వాగులోకి దిగి, దాన్ని దాట యత్నించింది. అయితే ప్రవాహం రానురాను హెచ్చి, అందులో రాక్షసి కొట్టుకుపోయింది.

సాయంకాలానికల్లా గోవిందుడు రాజకుమారులతోనూ, ఆవులతోనూ రాజుగారి ఇల్లు చేరి, జరిగినదంతా రాజుగారికి తెలిపాడు. రాజుగారు సంతోషించి గోవిందుణ్ణి తగిన విధంగా సత్కరించాడు.






# కోటీశ్వరుడు

కంచిలో ఒక వైశ్యుడుండే వాడు. అతను వర్తకం చేసి అంతులేని డబ్బు సంపాదించి, కోట్లు గడించి, నవ కు బే రు డ నే పేరు పొందాడు. అతనికి అనేక మంది కొడుకులూ, కూతుళ్ళూ కలిగారు. అతను వారందరికీ పెళ్ళిళ్ళు చేసి, అల్లుళ్ళను కూడా తన వద్దనే ఉంచుకుని, వాళ్ళకు కూడా పనులు కల్పించి, తన వర్తక వ్యాపారాలను ఇంకా పెంచుకున్నాడు. కాలక్రమాన అతని బంధుకోటి పెరిగి, అతని ఇల్లు ఒక దివాణంగా మారిపోయింది. బంధువుల మధ్య అతను అత్యంత వైభవంతో జీవిస్తూ రాజయోగంగా అనుభవించాడు.

అయితే నవకుబేరుడు తన ఇల్లు దాటితే పరమ లోభి. అతను దానధర్మాల కింద గాని, తీర్థయాత్రల కని గాని, దేవుడి పేరు చెప్పి గాని ఏనాడూ చిల్లిగవ్వ ఖర్చు పెట్టి ఎరగడు.

ఇలా ఉండగా ఒకనాడు నవకుబేరుడి ఇంటి ముందు ఒక బైరాగి వచ్చి నిలబడి, తనకా పూట భోజనం పెట్టమన్నాడు.

"పోరా దొంగ వెధవా! నువ్వెక్కణ్ణించి ఊడిపడ్డావు!" అని నవకుబేరుడు చీదరించుకున్నాడు.

"నేను దొంగనైతే బిచ్చమెత్తుకునే కర్మేమిటి?" అన్నాడు బైరాగి.

ఇద్దరికీ కొంతసేపు వాదన జరిగిన మీదట, ఆ బైరాగివాడు తన కాలం వృథా చేస్తున్నాడని కోపం వచ్చి, నవకుబేరుడు అతన్ని తన నౌకర్ల చేత బయటికి గెంటించాడు. బయటికి గెంటినా ఆ బైరాగి, స్వయంపాకం ఇస్తేగాని వెళ్ళనని భీష్మించుకుని, సాయంకాలం దాకా ఇంటి కెదురుగా కూర్చున్నాడు.

"నువ్విక్కడే చచ్చినప్పటికీ నేను స్వయంపాకం ఇవ్వను. ఎంత కాలం

టి. మధుసూదనరావు





కూర్చుంటావో కూర్చో," అన్నాడు నవకుబేరుడు. ఆ బైరాగి మూడు పగళ్ళూ, మూడు రాత్రులూ వీధి వాకిలి కెదురుగా అలాగే కూర్చున్నాడు. ఆ బైరాగి శపిస్తాడేమో నని అప్తులు నవకుబేరుడితో అన్నారు. కాని అతను భయపడలేదు; వీధి తలుపు మూయించి మరొక దారిన రాకపోకలు ఏర్పాటు చేసుకున్నాడు.

కొన్ని రోజుల అవతల చూస్తే బైరాగి ఎటో వెళ్ళిపోయాడు. తానొక ఘనవిజయం సాధించినట్టు నవకుబేరుడు సంతోషించాడు. కాని వీధి వాకిలి తెరిచిన మర్నాడే మళ్ళీ బైరాగి ప్రత్యక్షమయాడు.

"ఈ బైరాగి నన్ను శని లాగా పట్టాడే! మళ్ళీ ఎందుకు వచ్చాడో కనుక్కోరా," అని నవకుబేరు డొక మనిషిని పంపాడు.

"నేను నిన్నేమీ యాచించటానికి రాలేదు, నీతో కొంచం మాట్లాడాలి," అని బైరాగి నవకుబేరుడికి కబురు చేశాడు.

అరు నెలల దాకా తనకు తీరదని నవకుబేరుడు జవాబు పంపాడు. బైరాగి వెళ్ళిపోయి, సరిగా ఆరునెలలకు మళ్ళీ వచ్చాడు. నవకుబేరుడు మరి కొన్ని వాయిదాలు వేశాడు. బైరాగి ఎంతో ఓపికగా వాయిదా నాటికి వస్తూ వచ్చాడు. ఇలా ఏడాది గడిచింది. ఆ బైరాగి చెప్పేది తాను వినక తప్పదనుకుని చివరకు నవకుబేరుడు అతన్ని పిలిపించాడు.

"ఏడాది నుంచీ చూస్తున్నాను. నువు మాయ చేత కప్పబడి, ఈ భార్యా పుత్రులనూ, బంధువులనూ నమ్ముకుని గుడ్డివాడి వైపోయావు. కళ్లు తెరిచి నిజం తెలుసుకో!" అన్నాడు బైరాగి.

"అయిన వాళ్ళందరినీ వదులుకోమని చెప్పటానికేనా ఇంత కాలమూ నా చుట్టూ తిరిగావు?" అని నవకుబేరు డడిగాడు.

"వీళ్ళలో నీకు నిజంగా అయినవాడు ఒక్కడూ లేడు. నువు సంపాదించి పెట్టు



తున్నంత కాలమూ వీళ్ళు నీకు బ్రహ్మరథం పడతారు. ఆ తరవాత నిన్ను జీవచ్ఛవంగా చూస్తారు. కావలిస్తే ఈ మాట రుజువు చేస్తాను." అన్నాడు బైరాగి.

అందుకు వైశ్యుడు కూడా ఒప్పుకున్నాక, బైరాగి ఒక ఉపాయం చెప్పి వెళ్లిపోయాడు.

తరవాత కొద్ది రోజులకు ఒకనాటి రాత్రి నవకుబేరుడు తన కేదో రోగం సంప్రాప్త మైనట్టు నటించాడు. ఆయన తన భార్యతో, "నాకు చావు దగ్గిర పడింది. ఇన్నాళ్ళు బతికాను గాని ఒక్క పుణ్యకార్యం చెయ్యటానికి కూడా నాకు వ్యవధి చిక్కలేదు. ఈ చావు ఇంకొక్క ఏడాది ఆగి వస్తే ఎంతో బాగుండేది." అంటూ ఉన్నపాళంగా బిర్ర బిగుసుకు పోయాడు.

నవకుబేరుడి భార్య కంగారుపడి వైద్యుణ్ణి పిలిపించింది. వైద్యుడు వచ్చి పరీక్ష చేసి, రోగం అంతు చిక్కక, తాను చేసేదేమీ లేదని చెప్పి వెళ్లిపోయాడు. నవకుబేరుడు బైరాగి చెప్పిన విధంగా ఊపిరి బిగబట్టి ప్రాణం పోయినట్టు నటించాడు.

అతని మీద పడి తింటున్నవారు దాదాపు రెండు వందలమంది ఉన్నారు. వాళ్ళంతా నవకుబేరుడి చుట్టూ చేరి శోకాలు పెట్ట సాగారు. కొందరు శ్మశాన వైరాగ్యం చెప్పి, ఎంత వారికీ చావు తప్పదన్నారు.



సరిగా అదే సమయానికి బైరాగి ఒక లోటాలో పాలు తీసుకుని అక్కడికి వచ్చి, అందరినీ ఊరుకోమని సైగ చేసి, "ఈ చచ్చి పోయిన మనిషిని బతికించుకోవాలని మీలో ఎవరికైనా కోరిక ఉన్నట్టయితే చెప్పండి. ఇదుగో సిద్ధౌషధం!" అన్నాడు.

నవకుబేరుడి భార్యా మొదలైన వాళ్ళు ఆ బైరాగి కాళ్ళ మీదపడి, "బాబూ, రక్షించండి, మీ రేంకోరితే అది యిస్తాం. అయన కా సిద్ధౌషధం యిచ్చి బతికించండి," అని ప్రాధేయపడ్డారు.

దానికా బైరాగి, "వెర్రివాళ్ళలారా, ఎంత సిద్ధౌషధమైనా ఆయువు మూడిన వారికి అయుర్దాయం ఇవ్వగలదా? ఈ ఔషధం మీలో ఎవరైనా తాగినట్టయితే వారు వెంటనే చచ్చిపోతారు. వారి ఆయుశ్శేషంతో ఈ చని పోయిన మనిషి కొంత కాలం బతుకుతాడు. ఇతనికి తమ ఆయువు ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నవాళ్ళు ముందుకు వచ్చి ఈ ఔషధం తీసుకుని తాగెయ్యండి. అతను బతుకుతాడు," అన్నాడు.

ఎవరూ పలకలేదు. కొంచెంసేపు చూసి బైరాగి, "ఎవరూ ఈ మనిషి కోసం చావరా?" అని అడిగాడు. జవాబు లేదు.

"అయ్యో, ఈ మనిషి తన జీవితమంతా వీళ్ళందరినీ సుఖపెట్టటానికి ధారపోసి, పరలోకంలో సుఖపడటానికి ఒక్క పుణ్య కార్యమైనా చెయ్యకుండా చనిపోయాడే! ఒక్కరైనా అతని కోసం తమ ప్రాణాల నివ్వకుండా ఉన్నారే!" అన్నాడు బైరాగి.

"స్వామీ కళ్ళు తెరుచుకున్నాయి!" అంటూ నవకుబేరుడు లేచి కూర్చున్నాడు. అందరూ నిర్ఘాంతపోయి, నిశ్చేష్టులయారు.

ఆ తరవాత నవకుబేరుడు పనికిమాలిన తన బంధువుల నందరినీ వెళ్ళగొట్టి, తనకు గల అంతులేని సంపదను దానధర్మాలకు వినియోగిస్తూ, వర్తకమంతా కొడుకుల పరం చేసి పవిత్రమైన జీవితం గడిపాడు.






# ముగ్గురు యక్షిణులు

## 2

చచ్చిపోయిన కొడుకు ప్రాణాలతో తిరిగి వచ్చేసరికి రాజు పొందిన ఆనందం అంతా ఇంతా కాదు. ఆయన మంగళుడితో, "నాయనా, నీ రుణం ఎలా తీర్చుకోవాలో తెలీదు. నీకేం కావాలో అడుగు. సాధ్యమైతే ఇస్తాను," అన్నాడు.

మంగళుడు తన వద్ద ఉన్న పాత్ర పైకి తీసి, "ఇలాటివి ఇంకా పదకొండు పాత్రలు కావాలి," అన్నాడు.

"అది నాకు అసాధ్యం, నాయనా!" అన్నాడు రాజు.

"నాకు మరేమీ అవసరం లేదు," అంటూ మంగళుడు తన గుర్రమెక్కి బయలు దేరాడు.

కొంతకాలం ప్రయాణించి అతను సముద్రతీరాన గల ఒక నగరం చేరుకుని, ఒక ఇంటికి వెళ్ళాడు.

ఆ ఇంటి యజమాని మంగళుణ్ణి చూసి "బాబూ, నీకు ఆతిథ్యం ఇవ్వలేను. మేం ఇంటిల్లిపాతీ పస్తులుంటున్నాం. ఈ నగరంలో ఎక్కడా నీకు పట్టెడు అన్నం పుట్టదు. మాకు కరువు వచ్చింది," అన్నాడు.

"నేను మిమ్మల్ని తిండి అడగను," అంటూ మంగళుడు తన వద్ద ఉన్న తుండు గుడ్డ తీసి నేలపైన పరిచి, దాని మీద బెత్తంతో కొట్టి, "వడ్డించు!" అన్నాడు. వెంటనే విందు భోజనం వచ్చింది.

"మీ వాళ్ళందరినీ భోజనానికి పిలవండి," అన్నాడు మంగళుడు ఇంటి యజమానితో.

మంగళుడి ధర్మమా అని ఇంటిల్లిపాతీ సుష్టుగా భోజనం చేశారు.

"మీకు కరువు రావటానికి కారణమేమిటి?" అని మంగళుడు ఇంటి యజమానిని అడిగాడు.



"మా దేశంలో తగినంత ఆహారధాన్యాలు పండవు. అందుచేత మేం వాటిని సముద్రం మీద తెప్పించుకుంటాం. కాని ఈ మధ్య ఒక అదృశ్యహస్తం మా ధాన్యపు ఓడలను ముంచేసి, మాకు తిండికరువు కలిగిస్తున్నది. ఏం చెయ్యాలో మాకు తోచటం లేదు," అన్నాడు ఇంటి యజమాని.

"ఏం చెయ్యాలో నాకు తెలుసు. మీ రాజుగారి దగ్గిరికి పోదాం," అన్నాడు మంగళుడు. ఇద్దరూ రాజు వద్దకు వెళ్ళారు.

"రాజా, మీ ధాన్యపు పడవలు క్షేమంగా చేరేటట్టు నేను చూస్తాను. నాకేమిస్తారు?" అని మంగళుడు రాజును అడిగాడు.

"నీకేం కావాలంటే అది ఇస్తాను," అన్నాడు రాజు.

మంగళుడు నలభై పడవలను వెంట బెట్టుకుని సముద్రం మీద వెళ్ళి, వాటిని ధాన్యంతో నింపుకుని తిరిగి వస్తూండగా, అకస్మాత్తుగా ఒక స్త్రీ చెయ్యి సముద్రంలో నుంచి పైకి వచ్చింది. ఆ చేతికొక బంగారు కడియం ఉన్నది.

మంగళుడు ఆ చెయ్యి పట్టుకుని విదిలించి, అవతలికి తోసేశాడు. చెయ్యి నీటిలో మునిగిపోయింది గాని, చేతికి ఉన్న కడియం అతని చేతిలోకి ఊడి వచ్చింది.

కాటకం తొలగిపోయింది. ప్రజలు కడుపు నిండా తిన్నారు.

రాజు మంగళుడితో, "నీకు ఏమి బహుమానం కావాలో కోరుకో, ఇస్తాను," అన్నాడు.

మంగళుడు తన పాత్ర పైకి తీసి, "ఇలాటివి ఇంకా పదకొండు కావాలి," అన్నాడు.

"నా రాజ్యమంతా అమ్మినా ఆలాటి పాత్ర రాదు. కావలిస్తే నా కూతురిని పెళ్ళాడు. నా నగరం ఇస్తాను తీసుకో," అన్నాడు రాజు.

"నాకు ఇలాటి పాత్రలు తప్ప ఇంకేమీ వద్దు. నా సోదరులు నలభైమంది కారా

గృహంలో మగ్గుతున్నారు. వాళ్ళను తలచుకుని నేను కన్ను మూయలేకుండా ఉన్నాను,'' అన్నాడు మంగళుడు.

''నేను నీకు ఒక సహాయం చెయ్యగలననుకుంటాను. రేపు ఉదయం కనపడు,'' అని రాజు మంగళుడితో చెప్పి, తన నౌకాదళాధికారిని పిలిపించి, ''యక్షరాజకుమార్తెలు భోజనాలు చేసే చోటు నీకు తెలుసును గద?'' అన్నాడు.

"తెలుసు, మహారాజా!" అన్నాడు నౌకాదళాధికారి.

"రేపు మంగళుణ్ణి అక్కడికి తీసుకుపోయి, ఆ స్థలం చూపించు,'' అన్నాడు రాజు.

మర్నాడు ఉదయం మంగళుడు వచ్చాడు. రాజు అతనితో, "నేను నిన్ను యక్షిణులు భోజనాలు చేసే చోటికి పంపుతాను. వాళ్ళు నీకు నువు కోరినటువంటి పాత్రలు ఇవ్వవచ్చు,'' అన్నాడు.

మంగళుడు తన గుర్రాన్ని తానున్న బసలోనే వదిలి, రాజుగారి నౌకలో బయలుదేరాడు. ఏడురోజులు ప్రయాణం చేసి వారు అవతలి తీరాన్ని చేరారు. నౌకాదళాధిపతి మంగళుడికి దూరంగా ఉన్న ఒక కోటను చూపించి, ''అదే, యక్షిణుల కోట,'' అన్నాడు. మంగళుడు నౌక దిగి కోటలోకి ప్రవేశించాడు. లోపల ఒక ముసలివాడు



వంట చేస్తున్నాడు. "ఎవరు, బాబూ, నువ్వు? యక్షిణులు వచ్చే వేళ అయింది. వాళ్ళ కంటపడితే ప్రమాదం. ఆ తెరల వెనక దాక్కో," అన్నాడా వంటవాడు.

మంగళుడు వెంటనే పోయి తెరల చాటున దాక్కున్నాడు.

కొద్ది సేపటిలో యక్షరాజు కుమార్తెలు ముగ్గురు వచ్చారు.

"వంట సిద్ధమయింది. వడ్డించమంటారా, అమ్మాయిలూ?" అన్నాడు వంటవాడు.

ముగ్గురూ భోజనాలకు కూర్చున్నారు.

అదీయిదీ మాట్లాడుతూ, మధ్యలో ఒక యక్షిణి ఇలా అన్నది:

"ఆ నలభైమంది దొంగలూ ఏడేళ్లపాటు వాగులో నీరు తాకకుండా ఆపగలిగాను. ఇంతలో ఎవడో కుర్రాడు వచ్చి నా చేతిని పట్టేసుకున్నాడు. చెయ్యి విడిపించుకోవటానికి అతన్ని పాత్రతో కొట్టవలిసి వచ్చింది. భలేవాడు!"

రెండో యక్షిణి వెంటనే, "నా మంత్ర దండం కాజేసి, చచ్చినవాళ్ళను బతికించిన వాడేమన్నా తక్కువ వాడా?" అన్నది, నిట్టూర్చుతూ.

వెంటనే మూడో యక్షిణి, "నా చేతిని తోసేసి, ధాన్యపు నౌకలను తీసుకుపోయి, నా చేతిలో ఉన్న నగరాన్ని విడిపించిన కుర్రాడెంతటి వాడై ఉండాలి!" అన్నది మరింత గట్టిగా నిట్టూర్చి.

ఈ మాటలను విన్న మంగళుడు తెరల చాటు నుంచి ముందుకు వచ్చి, "ఆ కుర్రాడు మీ ఎదటపడితే వాడికేమి ఇస్తారు?" అన్నాడు.

"ఏం కావాలంటే అది ఇస్తాం!" అన్నారు ముగ్గురు యక్షిణులూ ఒక్కసారిగా.

ముగ్గురూ ఒక్కసారే మంగళుణ్ణి గుర్తించి, ఆశ్చర్యపోయారు. వాళ్ళు అతన్ని తమ సరసను కూర్చోబెట్టుకుని, "ముందు మాతో కలిసి భోజనం చెయ్యి," అన్నారు.

—(ముగింపు వచ్చే సంచికలో)



# 109. ఊగేరాయి

బ్యూనోస్ ఏరిస్ (అర్జెంటీనా) నగరానికి దక్షిణంగా ఉన్న పొట్టి కొండలలో ఈ వింతరాయి ఉన్నది. దీని బరువు సుమారు 700 టన్నులు. అయినా ఇది ఎవరన్నా చేత్తో తోస్తే ఊగుతుంది. ఈ వింత రాయి ఇలా "బాలెన్స్" అయి ఉండటానికి కారణం, గాలి వల్లా, వాన వల్లా కలిగిన అరుగుదల.



Photo by J. Ramanan



బహుమతి పొందిన వ్యాఖ్య

ఎంత సంతసంబు ఎక్కినందుకు గేదె!

పంపినవారు: ఎ. రత్నకుమారి, నందివెలుగు

Photo by J. S. Pareek



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఏను గెక్కినతని కేమి లేదె!

పంపినవారు:
ఎ. రత్నకుమారి, నందివెలుగు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1971 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ డిసెంబర్ నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఎంత సంతసంబు ఎక్కినందుకు గేదె !

రెండవ ఫోటో: ఏను గెక్కినతని కేమి లేదె!

పంపినవారు: ఎ. రత్నకుమారి,
నందివెలుగు (గుంటూరు జిల్లా)

బహుమతి మొత్తం రు. 20/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., anu Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

వనమూలికలనుండి తయారైన

# ఆవు  గుర్తు



## బ్రాహ్మీ ఆమ్లా హెయిర్
## ఆయిల్
## నల్ల పండ్ల పొడి

పైన చెప్పబడిన ఈ ఉత్పత్తులు హెయిర్ ఆయిల్ మరియు పండ్ల పొడి మాత్రమే కాదు. అవి ఆయుర్వేద ఔషధములు కూడా.

**ఆయుర్వేద శేవాశ్రమ్ ప్రైవేట్ లిమిటెడ్**

ఉదయపూర్ • వారణాసి • హైదరాబాద్

heros'-AS 96B TEL

# ఇప్పుడు చూయింగ్ గమ్ క్రొత్త ఆనందాన్ని కలిగిస్తుంది!

## చిక్‌లెట్స్
### చూయింగ్ గమ్

ADAMS
Chiclets
TUTTI-FRUTTI
FLAVOR COATED GUM
12 PIECES
Chiclets

**60 పైసలకు 12**

చిక్‌లెట్స్ చూయింగ్ గమ్ ఇప్పుడు అద్భుతకరమైన క్రొత్త రుచితో లభిస్తుంది:

టూట్టీ-ఫ్రూట్టీ!



అద్భుతకరమైన రుచిగల
చిక్‌లెట్స్ చూయింగ్ గమ్
—ఇప్పుడే కొనండి!

పెప్పర్‌మింట్ రుచిగల
చిక్‌లెట్స్ కూడ లభిస్తుంది:
60 పైసలకు 12
10 పైసలకు 2

ఆడమ్స్‌వారి శ్రేష్ఠమైన తయారీ

WH. 1426

కుటుంబము అంతటికి ఫోస్‌ఫోమిన్® వల్ల ఆరోగ్యము కలుగును





ఫోస్‌ఫోమిన్
- శక్తిని పెంపొందించును
- ఆకలిని అధికము చేయును
- సహజ శక్తిని హెచ్చించును
- శరీరము యొక్క రోగనిరోధక శక్తిని ఎక్కువచేయును.






SQUIBB® TTT®
SARABHAI CHEMICALS

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్కార్పొరేటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం: దీని లైసెన్స్డు ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

ఫోస్‌ఫోమిన్...
ఆకుపచ్చని పండ్ల రుచిగల
విటమిన్ టానిక్

Shilpi HPMA-35A/70 Tel


ఆనంద్‌కు ఇంచుమించు
స్కాలర్‌షిప్
పోయినంత పనైంది!


పరీక్ష రోజున...
ఆనంద్, పరీక్షలో బాగా రాయాలి. స్కాలర్‌షిప్ నిలబెట్టుకోవాలి. గుర్తుంచుకో.


పరీక్ష హాల్లో...
బలే, పేపరు ఎంత తేలిగ్గా ఉంది!


ఒక గంట తరవాత...
నా పెన్ను రాయటం లేదు, ఏమైందో.


టైములో పూర్తి చెయ్యటం ఎట్లా ?


విచారించొద్దు, ఆనంద్. ఈ కేమ్లిన్ పెన్ను, కేమెల్ సిరా తీసుకుని రాయి.


హా, ఈ సిరా బలే బాగా రాస్తోంది. అక్షరాలు మెరుస్తున్నాయి కూడా. టైములో రాయటం పూర్తి చేస్తాను.


ఆనంద్ టైములో పూర్తి చేశాడు...


పరీక్ష ఫలితాలు తెలిసిన రోజున...
శెబాష్ ఆనంద్
అభినందనలు


గుర్తుంచుకోండి, కేమెల్ సిరా
మరియు కేమ్లిన్ పెన్ను
సాఫీగా రాస్తాయి.
ఎప్పుడు కేమెల్‌యే
కావాలనండి.

# సవ్యమైన పెంపకానికి రక్తి బోర్న్‌విటా శక్తి !



ఎదిగే వయసులోని చదువుకొనే పిల్లలకు రోజువారీ భోజనంవలన చేకూరే శక్తి చాలదు. వారికి కలిగే శక్తి అంతా చదువుల్లో ఆటలల్లో హరింపు అయిపోతుంది. పిల్లల సవ్యమైన పెంపకానికి సరియైన పోషణకు అధిక శక్తి చాలా అవసరం. తగిన శక్తిని సమకూర్చేందుకు వారికి ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వాలి. బోర్న్‌విటాతో పిల్లలు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండగలరు. రుచికరమై శక్తి పోషకమైన బోర్న్‌విటా కోకో, పాలు, మాల్ట్, పంచదారల సంతులిత మిశ్రమము, మరి దీనిని తయారు చేసేవారు — క్యాడ్‌బరిస్




Bensons/0391 TEL.

**శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం-క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా !**

